# మా మాట

మానవుని మనోవికాసానికి ఎంతవరకు అంతు వుండదో, అంత వరకు, ఎన్ని సాహితీ సంస్థలు ఎంత కృషి చేసినా, చేయ వలసినది వుంటునే వుంటుంది. అందుకని మానవుని ఉత్సాహం, ఉత్తేజం, ఉద్రేకం, ప్రతిబింబించే రచనలను, అందరి అందుబాటు లోనికి వచ్చేటట్లు నవ్యభారతి కృషిచేస్తూ వుంటుంది.

కాలగమనంతో వచన రచనలకు, నేటి సాహిత్య రంగంలో అత్యంత ప్రముఖస్థానం వచ్చింది. సాహిత్య నందనవనంలో ఒక మంచి కథ ఒక సుగంధ పుష్పంవంటిది. ఈ దృష్టితో, శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రిగారి కథల సంపుటిని (కచటతపలు) గత నవంబరు లో ప్రచురించాము. ఈ మా ప్రచురణ గురించి వెలువడిన అభిప్రాయాలు మాకు యెంతో ప్రోత్సాహం కలిగించినాయి. వాటిని యీ పుస్తకం చివరి భాగంలో పొందు పరుస్తున్నాము.

మా ద్వితీయ ప్రచురణ 'చెరగని అక్షరాలు' కూడా సహృదయు లైన పాఠకలోకం యొక్క అభిమానాన్ని పొందగలదని ఆశిస్తున్నాం.

ఇంతేగాకుండా, రాజకీయ, సాంఘిక, ఆర్థిక, నైతిక రంగాలలో సమకాలీన దృక్పథాన్ని వివేక వంతులైన ప్రజలకు సులభ శైలిలో తెలియచేయటం నవ్యభారతి ప్రత్యేకాశయం.

యంత్రంతో పోటీపడి పరుగెత్తే మానవుని మెదడుకి విశ్రాంతి, వికాసం, కలుగ చేయటానికి నవ్యభారతి చేసే కృషికి ఆంధ్ర ప్రజానీకం ఆదరంతో సహాయ పడగలదని ఆశిస్తున్నాం.

సెప్టెంబరు, 1957
హైదరాబాదు.

నవ్యభారతి.

ఇందులో



కృతజ్ఞతలు

మొదటిసారిగా యీ కథల్ని పాఠకలోకానికి పరిచయం చేసిన వివిధ పత్రికాధిపతులకు

ముఖచిత్రం వ్రాసియిచ్చిన శ్రీ వెల్లటూరి పూర్ణానంద శర్మ గారికి

# ఉపాకాయలం

పారమ్మ చెయ్యి తగలగానే సీతి యింకా ముడుచుకుపోయి 'చలేస్తోందే' అంది. గోతాం అడ్డుగట్టినా అందులోని చిల్లులు, కిటికీగుండా వచ్చే చలి గాలిని అడ్డుపెట్టకుండా వదిలేస్తున్నాయి. సీతి పడుకున్న చింకి గుడ్డ చల్లగా ముద్దయిపోయింది. ఆ గుడిసెకి అతి దగ్గరలో వున్న కోనేరు, నీళ్లున్న రోజుల్లో, చెమ్మ పురకటము, అక్కడవున్న నేలకి అతి సహజమయిన విషయం. చలి రోజూ వున్నదే అయినా, దానికి అలవాటు పడటం సీతికి మహా కష్టం అయిపోతోంది! ప్రొద్దు కుంకి నప్పటినుంచీ, సూర్యోదయం అయేటంత వరకూ చలి అన్ని గుడిసెలతోపాటు సీతి వున్న గుడిసెలో గూడా తిష్ట వేసే వుంటుంది. ఎంత వద్దనుకున్నా సీతి గజగజా వణకని రోజు వక్కటిగూడా వుండదు, చలి కాలం వచ్చిందంటే. దానికితోడు నేలనుంచి వూరే చెమ్మ మంచులాగా అయిపోయి చలికి భయపడే వాళ్ళని యింకా యుడిపిస్తూనే వుంటుంది. తెల్లవారినా సూర్యోదయం అయేటంతవరకూ సీతికి లేద్దామని లేదు. అన్నీ వుడిగిన పారమ్మకు చలిబాధ తెలియటంలేదు.

సీతి, పారమ్మ చేతిలోపడి పైకి లేచిన తన చిన్న చేతిని వడిలోకి లాక్కుని యింకా ముడుచుకుని పడుకుంది; పైకి పాకిన పరికిణీని చీలమండదాకా కిందకి లాక్కుంటూ, నిద్రలోవున్న సుఖం లేచిన తర్వాత వుంటుందని నమ్మకం కలగటంలేదు సీతికి. నిద్ర కళ్ళల్లో నుంచి ఆ పూరి గడపలన్నీ కూడా వక్కొక్కటే కనబడుతూ మాయమవుతున్నాయి. పారమ్మ వాకిట్లోకి వెళ్ళి, వచ్చి సీతిని బలవంతాన లేవదీసి కూర్చోబెట్టి 'ఇవ్వాళేమన్నా లేస్తావా లేవ్వా...పండగపూట మరీ వస్తోందే' అంది బలవంతాన కూర్చున్న సీతిని వదిలేస్తూ. సీతి వదలటంతోనే కూలబడి యిక లాభం లేదని వక్కసారిగా నిలబడి ఆవలించింది. కళ్ళంటుకుపోయి తెరవనివ్వలేదు! కళ్లు నలుపుకుంటూ తడబడుతున్న కాళ్ళతో వాకిలిదాకా వచ్చింది. కనురెప్పల నడుమనుంచి ప్రపంచమంతా పంచరంగులతో కనిపించింది. ఏడుపులోనే పేలవంగా నవ్వు వచ్చింది.

పారమ్మ వాకిట్లో పడివున్న కుండ చట్టిని లోపల పడేసి తలుపుకు తాడు కట్టేసి సీతిని వాకిట్లోకి ఈడ్చుకి వచ్చింది. అప్పటిదాక సీతి ముఖం పారమ్మ దృష్టిలో పడనే లేదు. కళ్ళు వుబ్బరించి కను కొలకులు ఎర్రగా వున్నాయి. సీతిని భుజాన వేసుకుని రోడ్డుమీదికి బయలుదేరింది. సందు మూలగా వున్న పంపు నీళ్లు అదే పనిగా కారి పోతున్నాయి. సీల విరిగి పోయి పంపు గట్టుమీద వెల్లకిలా పడివుంది. దాన్ని పక్కకు తోసేసి సీతిని మెల్లిగా గట్టుమీదికి దించింది. ఏక ధారగా ఎస్తున్న నీటిని కొంచెంగా చేత్తో తీసుకుని సీతి కళ్లు తడిపింది. మంటతో కొద్దిగా మూలిగింది సీతి. పారమ్మ కొంగుతో కళ్లు తుడిచి, 'ఏమే సీతి...యిప్పుడు బాగా కనపడు తోందిచే' అంది. సీతి పరికిణీ పైకెత్తి తుడుచుకుని 'ఇప్పుడు బాగానే వుందే...యింక నడిచి వస్తా...పోదామా' అంది.

అది సుకుమారమైన ఆ పాప చిన్ని వేళ్లు పారమ్మ మొరటు వేళ్ళ చుట్టూ పెనవేసుకుపోయినాయి. పాప పది అడుగులు వేసే లోపుగా పారమ్మ రెండడుగులు అతి విదానంగా వేస్తుంది. తనకంటె ముందు పోతున్న పారమ్మ కుడికాలు వంక చూసి తనుగూడా అంత పెద్దదాన నయితే ఎంత బాగుంటుందా అనుకుంది. ఆ వక్క కారణం వలనగాని పెద్ద దానిగా రూపొందాలని సీతి ఎన్నడూ కోరుకో లేదు. పెద్దవాళ్ళ కుండే బాధ్యతలు లీలగా తెలుస్తూనే వున్నాయి. తనబోటి చిన్ని పాప లుంటే వాళ్ళను గురించి తీసుకోవలసిన శ్రద్ధ తను అనుభవిస్తున్న విష యమే. ఆ సంగతి యింకా వకళ్ళద్వారా నేర్చుకోవలసిన అవసరం లేదు.

సీతి రోడ్డు ఎక్కేదాకా గబగబా నడిచింది గాని, అంతటితో కాళ్ళలో సత్తువ హరించి పోయింది. పారమ్మతో చెపుదామని రెండు మూడు సార్లు చెయ్యి గుంజి ప్రయత్నించింది గాని, పారమ్మకు వున్న ముందు దృష్టి పక్కనే వున్న పాపను చూడనీయ లేదు. తడబడుతున్న అడుగులు పారమ్మ చేతిబలంతో యింకా ఎక్కువ కంపరాన్ని పొంది నాయి. ఒకొక్కసారి రోడ్డుమీద ఈడ్చుకు పోతున్నట్లే వుంటుంది పారమ్మ సీతిని తీసుకుపోయే పద్ధతి చూస్తూంటే. సీతి యింక లాభం

లేదనుకుంది. పారమ్మ చేతిని వదిలించుకుని 'యింక రాలేనే' అంటూ మారాం చేసింది. జారిపోయిన చేతిని మళ్ళీ చేతిలోకి తీసుకుని 'ఎందుకు వస్తావు...తిన్నదరక్క' అంది పారమ్మ. సీతికి కళ్ళ నీళ్ళ పర్యంతం అయింది 'ఎప్పుడమ్మా...రాత్రి అసలు అన్నమే తినలేదుగా' అంది. పారమ్మ గబుక్కున సీతిని చంకలోకి తీసుకుని హృదయానికి హత్తుకుని 'తమాషాకన్నానమ్మా...యిప్పుడు తిందువుగానిలే' అంది. పారమ్మ కంటినుండి జారిన అశ్రు బిందువు సీతి దృష్టిలోకి రాలేదు. రెండు చేతులతో గట్టిగా కౌగలించుకుని 'మా అమ్మ చాలా మంచిది' అనుకుంది.

పారమ్మ అడుగులు గబగబా పడుతున్నాయి. సీతి హృదయం గుబగుబా కొట్టుకుంటోంది. పారమ్మ ముందుకు నడిచిపోతుంటే రోడ్డును ఆధారం చేసుకున్న పరిసరాలన్నీ వారిని వదిలి ఎక్కడికో పోతున్నట్లనిపించింది సీతికి. ఎక్కడినుంచో పైనుంచి వచ్చి పడిన సీమ టపాకాయ పారమ్మ ముందుగా 'ఢాం' అని పేలింది. సీతి వులిక్కిపడి వెనక్కి తిరిగి చూచింది. ఎర్రటి టపాకాయపైన చుట్టినరంగు కాగితాలు చినిగిపోయి చిందర వందరగా పడిపోయినాయి. సీతి-పారమ్మ చంకలోనుంచి కిందికి జారింది. నాలుగు పక్కలా కలయచూచింది. అన్నీ ఎర్రకాగితం పీలికలే. వక ముక్కను పైకితీసి వాసన చూస్తూ 'అమ్మా యిదేమిటే' అంది. సీతి చేతిలోని కాగితంముక్క గాలికి ఎగిరి వచ్చి పారమ్మ కొంగుమీద పడింది. సీతిని చేతుల్లోకి అందుకుంటూ 'సీమ టపాకాయే...కాలుతుందమ్మా' అంది. సీతి చేతుల్ని విదిలించుకొని 'నడిచివస్తానే' అంది. పారమ్మ పట్టుబట్టలేదు సీతి నడక విషయంలో.

చూస్తుండగానే సీతి ముందర యింకొక టపాకాయ పేలింది. పేలక మునుపు దాని ఆకారం ఎట్లావుంటుందో చూద్దామనుకుంది. అంత ధ్వని ఎక్కడినుంచి వస్తున్నదో పసిగడదామనుకుంది. మోత వినబడే టంత వరకూ అది సీమ టపాకాయ అని తెలియలేదు. తెలిసిన తర్వాత రంగు కాగితపు పీలికలు తప్ప టపాకాయ కనిపించలేదు. సీతి గోముగా పార్వతిపైన చెయ్యివేసి 'అమ్మా టపాకాయ నాకోటి...యివ్వవుటే' అంది. పారమ్మ గట్టిగా గదమాయిద్దామనుకుంది. గాని, అసలే నీరసంగా

కదల్లేకుండావున్నప్పుడు మంచిపని గాదని పూరుకుంది. 'అయ్యగారి నడిగి యిప్పిస్తాగా...తొందర పడకు మరి...ఆ...అదుగో చూడు, వక్క నిమిషంలో యిల్లు దగ్గర కొచ్చేస్తుంది...' అంది. సీతి కనబడుతున్న మేడ పై అంతస్థుచూస్తూ, 'మన అయ్యగారి యింటి దగ్గరనేనా...' అంది. 'అవునే మన అయ్యగారి యింటిదగ్గరే' అంది. ఆమె గొంతు గద్గదమైంది. ఆ ధ్వని లోతులను అవగతం చేసుకో గలిగిన లోతు హృదయంకాదు సీతిది. పారమ్మ కొంగు గట్టిగా పట్టుకుని 'అయితే తొందరగాపదవే...' అంటూ అడుగులు తొందరగా వేయటం మొదలు పెట్టింది. పారమ్మ నావ్వకుంధి.

చిల్లర దుకాణం వాడు పారమ్మను దూరంనుంచే గుర్తుపట్టాడు. 'ఏం పారమ్మా యిటు రాకుండానే పోతున్నావు' అన్నాడు. వచ్చే పోయే టప్పుడు పారమ్మను పలకరించటం అతనికి అలవాటు. అందులోనే అతనికి అంతులేని సంతృప్తి. పారమ్మకు కావలసిన చిల్లర సరుకులన్నీ చాలా తక్కువ ధరకే దొరుకుతాయి అక్కడ. ఊరికే యివ్వటానికైనా దుకాణంవాడు వెనుదీయడు గాని, ఆ మాటంటే పారమ్మ ఆ చాయలకు తిరిగి రాదని అతనికీ గట్టిగా తెలుసు. పారమ్మ అతని పైపు రోడ్డు మీద నుంచేచూస్తూ 'యిప్పుడు తొంధర పనిమీద పోతున్నానయ్యా... మళ్ళీ వచ్చి మాట్లాడుతాలే' అంది పమిట కొంగు తలమీదకు మెల్లిగా లాగుకుంటూ. ఆమె నోటినుంచి వెలువడే ప్రతి పదమూ, అతనిలో అణచ బడిన వింత ప్రవృత్తులకు జాగృతి పాడుతుంటాయి. ఎండి పోయిన అతని జీవితంలో అదొక్కటే చిగురు టాకు. దానిని చూసు కునే అతను జీవించగలుగుతున్నాడు. ఆ చిగురు ఆకులవుతుందనీ, ఆకుల మధ్య మొలిచిన మొగ్గపూచి ఫలిస్తుందనీ అతని కప్పుడప్పుడు అనిపిస్తూ వుంటుంది. పారమ్మ అతనితో మాట్లాడుతూ వుంటే, అంతకు మించి అతను జీవితంలో కోరుకొన గలిగినది మరొకటి లేదు. ఈ నాలుగేళ్ళ పరిచయం లోనూ పొంద గలిగింది కూడా అదే. గొంతు శ్రుతి ఇంకా కొంచెం హెచ్చింది.

'రా పారమ్మా...పోదువుగానిలే...మంచి మాటొకటి చెపుతాను'

అన్నాడు. పారమ్మ చీదరించు కుంటున్నట్లు ముఖంపెట్టి 'ఏంటో గొడవ చెప్పరాదూ...నేను పోవాలయ్యా అంటుంటే' అంది దుకాణపు వైపుకి వచ్చి నిలబడింది.

'పండగ కాదు పారమ్మా...చిల్లర సరుకేం తీసుకు పోవూ?'

'వెళ్ళేటప్పుడు తీసుకు పోతా లేవయ్యా...తొందర పనుందని చెప్పటంలా...పిల్లది సీమ టపాకాయలు కావాలంటోంది.'

దుకాణం వాడి ముఖం చిన్నబోయింది. సీమ టపాకాయలు తన దుకాణంలో వుంచనందుకు. దగ్గర దుకాణం వక్కటి గూడా లేదు. పోనీ అక్కడినుంచి తెచ్చి యిద్దామనుకుంటే, పారమ్మ నోరు తెరచి కావాలన్న వస్తువు యివ్వలేక పోయినందుకు—దుకాణం వాడు సంభాషణ పొడిగించటానికి సావకాశం లేకపోయింది. ముఖం విదారకంగా పెట్టి 'నువ్వు వెళ్ళేటప్పుడు రా పారమ్మా...టపాకాయలు తెచ్చి పెడతాగా... అందరు ఎట్లా తీసుకుంటే నువ్వు అట్లాగే తీసుకుందువు గానీలే' అన్నాడు. పారమ్మ దృష్టి యిందాకటినుంచి దుకాణం మూలగా ఉన్న డబ్బా మీదనేవుంది. దానిలో వున్న పొడి ఎర్రగా ధగ ధగ లాడుతోంది. దానిని చూస్తున్న కొద్దీ. కడుపు తరుక్కు పోయి దుఃఖం వెల్లువలై వస్తోంది పారమ్మకు.

'ఏం సెట్టీ...ఆ డబ్బాలోది ఏంటి, అంది. పారమ్మ చూపుడు వేలు సెట్టి దృష్టిని సరియైన డబ్బామీదికే తీసుకునిపోయింది. సెట్టి క్షణకాలంపాటు స్తంభితుడై నాడు.

'ఏం లేదు పారమ్మా...దాని సంగతి నీ కెందుకులే' అన్నాడు పారమ్మ వంక సూటిగా చూడటానికి ధైర్యం చాలక.

'అలాగాదు సెట్టీ...అదేమిటో చెప్పరాదూ...కుంకమేనా?' సెట్టి ఎందుకనో గజ గజ లాడాడు. అతని శరీరం అతని స్వాధీనం తప్పి వణకటం ప్రారంభించింది.

'ఎందుకు సెట్టి భయపడతావు. దానితో నాకీనాడు అవసరం కలిగింది...దానికి సరైన ధరనే కట్టియివ్వు...వెల తక్కువలో కుంకం

నాకక్కర్లేదు...' అంది. సెట్టి త్రాసు ముందరనుంచి, పైనుంచి వ్రేళ్ళాడుతున్న తాడు పట్టుకుని లేచివచ్చాడు మూలనున్న డబ్బా వైపుకు. పక్క గోడకువున్న మేకు మీద వ్రేలాడుతున్న త్రాసును తీసి పళ్ళెంమీద వున్న దుమ్మును గట్టిగా వూదాడు. దుమ్మువున్న స్థానంలోకి కుంకుమ రాబోతున్నదనే టప్పటికి పారమ్మ ఆనందానికి పరవడి లేకపోయింది. అయినా తను తీసుకోబోతూన్న కుంకుమ తూచి యివ్వటానికి సిద్ధపడ్డ సెట్టిని చూచేటప్పటికి ఆమె ముఖం మీద విషాద ఛ్ఛాయలు అలుముకు పోయినాయి. గబగబా దుకాణంలోకి రెండడుగులు వేసి, 'సెట్టి...నా కుంకుమను తూకం చెయ్యవద్దు...నువ్వు ధరనూ కట్టవద్దు...నా క్కావలసినది నేనే తీసుకుంటాను...' అంది. సెట్టి పక్కకు తొలిగాడు నోట మాట రాక. పారమ్మ కుంకుమ డబ్బాను చేతిలోకి తీసుకుని, మొదటి రెండు వేళ్ళతోనూ ముఖంనిండా అద్దుకుంది. దుకాణంలో పైగా వ్రేలాడ తీయబడ్డ అద్దం ముందరకు వెళ్ళి, ముఖాన పెట్టుకున్న కుంకుమను చూసుకుంది. రూపాయ బిళ్ళంత వున్న కుంకుమ మధ్య మధ్య తళుకు తళుకుమని మెరుస్తున్నాయి చెమికీ ముక్కలు. సీతి పారమ్మ కొంగు పట్టుకులాగి 'నా ముఖానాగూడా' అంటూ ముఖం చూపించింది.

'సెట్టి పాప ముఖాన కొంచెం కుంకం పెడతావా' అంది. పారమ్మ విచిత్ర ప్రవర్తనకు స్తబ్ధుడైన సెట్టి మారు మాట్లాడకుండా వక చిటికెడు కుంకుమ తీసి, సీతి ముఖాన మెత్తాడు. సీతి గూడా అద్దంలో చూచుకొని మురిసిపోయింది. పారమ్మ వైపుకు తిరిగి, 'అమ్మా నువ్వుగూడా రోజూ పెట్టుకో రాదుటే' అంది. పారమ్మ సీతిని గట్టిగా హృదయానికి హత్తుకుని బావురుమంది.

సెట్టి కొంచెంగా తమాయించుకుని 'ఏం పారమ్మా...మీ ఆయన వచ్చాడా—' అన్నాడు ఆమె ముఖమండలంలో మెరుస్తున్న తన కుంకుమ వంకచూస్తూ. పారమ్మ చాలా ముక్తసరిగా సెట్టివంక చూస్తూ 'అవును సెట్టీ...వచ్చాడు' అంది. సెట్టి మాట్లాడటానికి భయపడు

తున్నాడు, ఏది మాట్లాడినా దానిలో ఏదో తప్పున్నదని మనస్సు వెక్కిరించి భయపెడుతోంది.

'ఎక్కడున్నాడు పారమ్మా...యింతవరకు చెప్పావుగాదేం,, పారమ్మ ముఖంలో విషాదచ్ఛాయలు లోతుగా పెరుగుతున్నాయి. సెట్టికి తన జీవితపు మోడులోవున్న ఎక్క చిగురు గూడా గాలికి వూడిపోయి, దానితోపాటు ఎక్కడో పోయి పడుతున్నట్లుగావుంది. కళ్ళనీళ్ళు వచ్చిన పర్యంతం అయింది. నీరు నిండిన కనులు ఆ భారాన్ని మోయలేక బయటి ప్రపంచాన్నంతా బరువుగా చూస్తున్నాయి. 'ఏం పారమ్మా ...అయితే ఈ పిల్లని వాళ్ళ అయ్యా...అమ్మాళ్ళదగ్గరికి పంపించేస్తావా' అన్నాడు. పారమ్మ ఆతనివంక తీవ్రంగా చూసింది. దాని కతడు భయపడి కాదు గాని 'అమ్మా పోదామే' అంటూ అరుస్తున్న సీతి గొంతుక అతని రక్త నాళాల్లో ప్రతి ధ్వనించి వుడికించి పారేస్తున్నాయి. సీతి పారమ్మ కొంగు లాగుతూ అమ్మా పోదామమ్మా...టపాకాయలకి' అంటోంది. సెట్టి అనుమానం నివృత్తికాలేదు. తనకు వచ్చింది అనుమానమేనా అని యిప్పుడు సందేహంకూడా కలిగి పారమ్మవంక జాలిగా చూస్తూ 'నేనడిగినమాటకు సమాధానం చెప్పవా పారమ్మా' అన్నాడు.

పారమ్మ అతనివైపు కఠినంగా చూసింది. సెట్టి వంచిన తలెత్తకుండానే 'ఏం పారమ్మా...మీ ఆయనెక్కడవున్నాడో చెప్పవూ' అన్నాడు. పారమ్మ చాలా ముక్తసరిగా 'నాకు తెలియదు' అంటూనే గిరుక్కున వెనక్కు తిరిగి సీతిని బుజాన వేసుకుని రోడ్డుమీదికి పెద్ద పెద్ద అడుగులతో బయలు దేరింది.

సీతికి యింతవరకూ మాట్లాడటానికి అవకాశమే చిక్కలేదు; సెట్టివున్నాడంటే ఆ కాసేపు అదే పనిగా మాట్లాడుతూనే వున్నాడు. అద్దైనా తనకి సంబంధించిన విషయాలు చాలా తక్కువగా వున్నాయి యిప్పుడే కొంచెం తీరిక కలిగింది; అది కాకపోయినా దూరంలో కనపడుతున్న మేడ అంతస్తు దగ్గరకు చేరే లోపుగా వుండే సమయాన్ని భరించలేకపోయింది. వెనకగా వెళ్ళిపోతున్న కరెంటు స్తంభాలవైపు చూస్తూ' 'అమ్మా టపాకాయలు అయ్యగారి దగ్గర యిప్పిస్తావు గదుటే,

అంది. సమాధానం వెంటనే వస్తుందని సీతి ఆశించలేదు. కోరుకోలేదు. గూడా—సమాధానం కోసం ఎదురుచూస్తూ కాలయాపన చెయ్యవచ్చు. సమాధానం వెంటనే వచ్చిందంటే రెండో ప్రశ్నకోసం మళ్ళీ ఆలోచించాలి.

పారమ్మ మౌనంగా పూరుకునేటప్పటికి సీతి మళ్ళీ అదే ప్రశ్న అడిగింది. 'టపాకాయలు యిప్పిస్తావు గాదుటే' అంటూ. పారమ్మ ఊఁ అంది. సీతి పక్కనిమిషం ఆలోచించి 'రోజూ ముఖాన బొట్టు పెట్టుకో రాదుటే...బాగుంటుంది' అంది. పారమ్మ మాట్లాడడంలేదు. సీతి యింకో క్షణం ఆగి 'యిందాకా ఆయనెవరో అన్నావు...ఎప్పుడు ఇక్కడికి వస్తాడే' అంది, 'మీ నాన్నమ్మా వస్తున్నాడు' అంది పారమ్మ.

అంటూనే నాలిక కరుచుకుంది తొందర పడి అనాలోచితంగా అన్నానేమో అనుకుని. సీతి కిప్పుడు ప్రశ్నల కొదవ తీరిపోయింది. పారమ్మ నోటినుంచి మాట రావటమే కష్టం. వచ్చిందంటే దానిమీద ప్రశ్నలు బహు తేలికగా అల్లవచ్చు. సీతి వెంటనే అందుకుని 'మన నాన్న ఎక్కడ పున్నాడే యిప్పుడు' అంది. పారమ్మకు ఆ మాటలు అంతగా రుచించటం లేదు. అంతటితో ఆపుదామనుకుని సమాధానం చెప్పకుండా పూరుకున్నా, కొంగుపట్టి లాగి సమాధానంకోసం తెగ వేధిస్తూంది. పారమ్మ మొదటికే మోసం తెచ్చింది. వూరికే తమాషా కన్నాను సీతి...మనకి అసలు నాన్నలేడు' అంది. సీతికి ఆ సమాధానం సంతృప్తి కలిగించిందనే చెప్పాలి. 'అట్లాగా అమ్మా...యింకా మనకి నాన్న పున్నాడనుకున్నా' అంది. పారమ్మ మనసు అగ్నిపర్వతంలోపల కుతకుతా వుడుకుతున్న లావా లాగుంది. పైకి మటుకు నింపాదిగా వుంది. సీతి అయిదు నిమిషాలసేపు చకచకా నడుస్తున్న పారమ్మ భుజంమీద పడుకుంది గాని తర్వాత భరించలేక పోయింది.

'అమ్మా' అంది గోముగా 'నన్ను ఎక్కడికో పంపించ మన్నా వేంటీ సెట్టి' పారమ్మ సీతి స్థాయిలోనే వుంది ఆలోచనలో 'తమాషా కడిగాడే...నిన్నెక్కడికి పంపిస్తాను నా దగ్గరే వుంటావు' అంది. సీతి

సంతృప్తి సూచకంగా నవ్వింది. పారమ్మ గూడా నవ్వింది. ఆ నవ్వు మసులుతున్న పాలలోని మీగడ తెరకలా వుంది.

మేడ వాకిలి యింకా పది గజాలువుంది అనగానే, టపాకాయ వకటి పెద్దశబ్దం చేస్తూ పేలిపోయింది. సీతి పారమ్మ చంకలో నుంచి కిందకు జారిపోయింది. 'అక్కడినుంచి నడిచి వస్తానంటూ' పారమ్మ అభ్యంతర పెట్టలేదు. వాకిట్లోనే నిలబడ్డ యింటి యజమానురాలు పారమ్మ ముఖాన తళతళమంటున్న కుంకుమ వంకచూచి విస్తుపోయింది. ఆ తత్తర బాటులో పారమ్మ లోపలకు వస్తుంటే పక్కకు తప్పుకుంది గాని అడ్డు పెడదామనిగాని, పెట్టాలనిగాని తోచలేదు. చరచరా-లోపలకు పోతున్న పారమ్మను పిలిచి-

'ఏమే పారమ్మా...యిట్లా తయారయ్యావు యివ్వాళ' అంది పారమ్మ ముఖంవంక సూటిగా చూస్తూ, పారమ్మ మనసారా నవ్వింది. ఆవిడ వంకచూస్తూ 'బా.గానేవున్నా గదూ...యివ్వాళ' అంది.

'బాగానే వున్నావులే...ముఖాన బొట్టేమిటి... ఈ అవతార మేమిటి' అంది ఆశ్చర్యపోతూ. పారమ్మ ముఖంలో కొంచమయినా ఆశ్చర్యం కనపడలేదు: కొంగు లాగుతున్న సీతిని ఎడంచేత్తో పక్కకు తోసేస్తూ 'వాదు వచ్చారండి యీ వూరు' అంది.

ఇంటావిడ మూర్ఛ పోయినంత పనయింది. 'నీచ కులాల్లో' మనుష్యులు విధవా వివాహం అంటే వెనుదీయరని, అందుకనే అటువంటి మనుష్యులు అలకా మనుష్యులుగా తయారయారని ఆవిడ నమ్మకం. పారమ్మ ఆ యింట్లో అడుగుపెట్టిన నాటినుంచీ యీనాటి వరకూ పారమ్మ ముఖంలో యింత కళ కళ కనపడలేదు. దానికి కారణం యింటావిడ వూహించ గలిగినదిగాలేదు. ఆమె చిన్ని బుర్రకు తట్టిన వూహల్లా పారమ్మ మళ్లీ పెళ్లీ చేసుకుందనే!

'ఏం పారమ్మా నిన్న రాత్రి పని చెయ్యటానికి రాలేదేం' అంది ఏదైనా మాట్లాడాలనే వుద్దేశంతో, పారమ్మ వంచిన తల ఎత్తలేదు. బొటన వేలితో నేలమీద చతికిలబడి చూపుడు వేలుతో ఏవో గీతలు

గీసి సున్నాలు చుట్టుతోంది. వాటి ఆకారం వివరంగా తెలియకపోయినా గుండ్రటి ముఖంమీద చుక్క పెట్టినట్టుగా వుంది చూడటానికి. యింటావిడ అయోమయంగా నిలబడి కాసేపు అటూ యిటూ చూచింది. ఎవరూ అటు పక్కకు రానేలేదు.

'నిన్నే నే...పిలుస్తే వినబడ్డంలా. చెముదొచ్చిందా ఏది...నిన్న రాత్రి పనికిరాక పోతివి...ఇవ్వాళ గూడా అంట్లన్నీ మసి పూసుకుని అట్లా ఏడుస్తున్నాయి. అల్లా స్తంభంలాగా నిలబడి పోయావేం' అంది వుక్రోషం అంతా వెళ్ళబోస్తూ. పారమ్మ చలించనే లేదు. వక్క అంగుళమయినా కదలలేదు. కాలి పక్కగా చతికిలబడిన సీతిని రెక్క పట్టుకు లేవదీసి కాళ్ళ మధ్యకు తీసుకుని తలను మృదువుగా నిమిరింది. సీతి ఆనందం పట్టలేక తన చిన్ని చేతులతో పారమ్మ కాళ్ళను అటూ యిటూ బాదుతూ గంతులేసింది. యింటావిడ వుక్రోషం పట్టలేక పోయింది తన మాటలు వీసమంతయినా లక్ష్యం యివ్వలేక పోయేటప్పటికి. రెండడుగులు వెనక్కువేసి 'ఏమిటే పాడుదానా...ఆ అల్లరి...? మట్టి అంతా పైకి లేస్తుంటేనూ' అంది పిల్లదాని వంక చురచురా చూస్తూ. పారమ్మ మౌనానికి భంగం కలిగింది. యింటావిడ వంక నిర్లక్ష్యంగా వకసారి చూసి యింట్లోకి చూస్తూ 'మా పిల్లేం పాడుది గాదు...అందరి మాటలు పడటానికి,' అంది. యింటావిడ అదిరిపడింది, తూలిపాటువచ్చి స్తంభాన్ని గట్టిగా పట్టుకుని 'అమ్మో అభిమానం వచ్చి పడిందే...నేలనంతా పాడుచేస్తుంటే గూడా ఏమీ అనగూడదా...అంట్లన్నీ దొడ్లోపడి ఏడుస్తున్నాయి పద..., అంది. పారమ్మ నింపాదిగా చూస్తూ—

'మీ యింట్లో పని చెయ్యటానికి రాలేదు., అన్నది. ఇంటావిడ చిన్నప్పుడు విచిత్ర వ్యక్తుల మనస్తత్వాలను గురించిన కథలనేకం చదివింది. వాటిలో ఏదీకూడా పారమ్మ మాదిరి వ్యక్తిత్వం గల పాత్ర వక్కటీ తగలలేదు. యింటావిడ పారమ్మ వైపు ఎగా దిగా చూసి కథలన్నీ అబద్ధాలు...మనుష్యులను గురించి నిజమైన విషయాలు;

రాయని కథలు ఎందుకు,' అనుకుంది. పారమ్మ కథలను గురించి ఆలోచించటంలేదు. ఎవరి కోసమో నిరీక్షిస్తోంది.

'ఈ పూటకి యింటి పనిచూసి పోతే...రేపటినుంచి మానేస్తే మానేద్దువుగానిలే, అంది యింటావిడ.

'అక్కర్లేదు అమ్మగారూ...యింతవరకూ అందరి యిళ్ళ పని చూస్తున్నాను...యిక నాయింటి పని చూచుకోవలసిన అవసరం వచ్చింది. అంది.

'అదేమిటే అట్లా అంటావు...' యింటావిడ ఏకవచన ప్రయోగం మనసుకు చాలా కష్టంగా తోచింది.

క్షమించాలి అమ్మగారు...ఏమిటే అంటూ నీచంగా పిలవటం నా కంతగా బాగుళ్ళేదండి.... నన్ను మర్యాదగా పిలిచేటంత ధైర్యం లేక పోతే పేరు పెట్టి పిలవండి!' అంది యింటావిడవంక చూస్తూ. ఆవిడ వక క్షణం నిశ్శబ్దంగా నిలబడి రోడ్డుమీద గుర్రం బండి వంక చూసింది. బండి శబ్దం చేసుకుంటూ పది గజాలు యిల్లు దాటి పైకిపోయి నిలబడింది. బండి తనింటికోసం వచ్చిందేమోనని రెండు నిమిషాలు నిరీక్షించి 'అట్లాగే పారమ్మా....వక విషయం చెప్పు....నువ్వు మళ్ళీ పెళ్లి చేసుకున్నావా...నా దగ్గిర దాపరికమెందుకు....' పారమ్మ యింటావిడ పక్కగా నడచి వెళ్ళి మెట్ల మీద చతికిలబడింది. సీతి వెనకాలగా వచ్చి వళ్ళో కూర్చుంది.

'ఏం చెప్పమంటారు....నాకు తెలియని వయసులో అయిన పెళ్ళి నాకు తెలియకుండానే భగ్నమయింది అమ్మాగారూ....నేను బాగా చదువుకున్నదాన్నే....ఒనానొక ప్రలోభాన్ని ఆశించి నా చదువును నా జీవితాన్ని వమ్ముచేసుకుని, యిలా ఆ యింటా....ఆ యింటా పని చేసుకుని బ్రతకటానికని వక నాడు వచ్చాను. ఈనాడు గౌరవం గల ఉద్యోగం ఏదైనా చేసుకుని నా పొట్ట నేను పోసుకోగలిగినా....మాట కుంటుబడింది. కళ్ళు చెమ్మగిలినాయి. సీతిని గట్టిగా చేతుల్లోకి తీసుకుని' 'ఈ పసికందును గురించి యిట్లా వచ్చాను అమ్మగారూ' అంది. ఇంటావిడ కళ్ళ నీళ్ళ

పారమ్మ చూడకుండానే చెరిపి వేసుకుంది. సీతి పారమ్మ కంటినీరు చూడ లేక రోడ్డు వైపుకి దృష్టి మళ్ళించింది. పారమ్మ మళ్ళీ ప్రారంభించింది.

'నా జీవితంలో దేనికోసం ఐతే ఆశించి నా జీవితాన్ని వమ్ము చేసుకున్నానో—దానితో పాటు నా ఆశలు గూడా అడియాసలయినాయి అమ్మగారూ.' ఇంటావిడ నిర్లిప్తంగా వక క్షణం ఆగి-

'అయితే. .మరి ఈ అవస్థ అంతా ఎందుకు పారమ్మా....ఇప్పు డేదో పెళ్ళి మాటఅన్నావు....యిప్పుడు మళ్ళీ పెళ్ళి చేసుకున్నావా?'

'కాదంటే నా పెళ్ళి అయి ఆరేళ్ళు దాటింది. అదిగూడా నేను కావాలని చేసుకున్నదే.... గాంధర్వ వివాహమనే దానికంటే పైశాచిక వివాహమంటే దానికి విలువ సరియైనది యిచ్చినట్లు అవుతుందేమో.... నా చేతులతో కట్టుకున్న బంధాన్ని ఈ నాడు వదులు చేసుకోవటానికి నిశ్చయించుకున్నాను....నా బిడ్డ జీవితంగూడా నా మాదిరిదే అవటానికి నా కిష్టంలేదు అమ్మగారూ' పారమ్మ చలించి పోయింది. పెదిమలు వికృతంగా కంపిస్తున్నాయి. కళ్ళు ఎర్రగా జ్యోతి లాగా వెలుగు తున్నాయి.

'నా పాపను ఏ దూర తీరానికో తీసుకుపోతాను....నా పాపను వక దారిలో పెట్టగలిగితే నా జీవితాన్ని సంతోషంగా చాలించ గలను అమ్మగారూ' యింటావిడ నిర్లిప్తంగా వింటోంది. పారమ్మ హృదయం కొయ్యలాంటిదని ఆమె అనుకుంటూ వుండేది. అదిగూడా మృదువుగా వుంటుందని ఎన్నడూ తోచలేదు. సీతిని తన కళ్ళ ఎదుట నిర్దాక్షిణ్యంగా బాదిన అనేక సందర్భాలు యింటావిడ మనస్సులో మెదులుతూనే వున్నాయి. అంత కంఠోరమైన కర్కశత్వంలో ఇంత వాత్సల్యం నిగూఢంగా ఇమిడివుందని ఎన్నడూ వూహకు కూడా స్ఫురించలేదు. గట్టి లక్క కరిగి నీరు అవటం ఎన్నిసార్లు చూచినా పారమ్మ హృదయం అటువంటిదని ఎన్నడూ తట్టలేదు. పారమ్మ వడిలో కూర్చుని చప్పట్లు కొడుతున్న సీతిని చూచి 'ఏం పారమ్మా....సీతిని ఎక్కడినుంచో తెచ్చావని చెప్పినట్లు గుర్తు....తండ్రి లేని పిల్ల అనిగూడా చెప్పినట్లు జ్ఞాపకం....' అంది.

'ఆ మాట నేనిప్పటికీ కాదనలేనుఅమ్మగారూ....ఈ పిల్లకి తండ్రి లేని మాట వాస్తవమే....అయనవున్నా, లేని వాళ్ళలోజత. తల్లిని బ్రతికుండి గూడా ఏంచేయగలిగాను నా పాపకి....యీ నాడు రెండు పూట్లా తిండి పెట్టలేక బాధిస్తున్నాను' అంది.

'ఎవడు పారమ్మా ఆ రాక్షసుడు...దరిద్రపు వెధవని....పెళ్లాం బిడ్డలను చూసుకో లేనివాడు....తాళి ఎందుకు కట్టాలి దరిద్రుడాని'

'అట్లా అనకండి....ఆయన నా భర్త అన్నమాట మరచి మాట్లాడుతున్నారు....తమ భర్తను దూషించటం ఏ స్త్రీగూడా సహించ లేదు అమ్మగారూ....క్షమించండి కఠినంగా మాట్లాడి నందుకు.... అయినా తప్ప లేదు.'

'ఎందుకు పారమ్మా వెనక వేసుకొస్తావు...మన నిలాంటి మూఢ ప్రేమే, కొనకు ప్రాణాలకి తెస్తుంటుంది...ముల్లును ముల్లుతోనే తియ్యాలి పారమ్మా...నేనే నీ స్థితిలో వుంటే వాడిని...ఛీ...అ పేరును తలవటం గూడా తల వంపుగా వుంది....'

'పొరబడు తున్నారు అమ్మగారూ...ముల్లును ముల్లుతో తియ్య గలిగినా, బురదను బురదతో కడగలేము...'

ఇంటావిడ యింకా ఏదో మాట్లాడ బోతుంటే ఎక్కడి నుంచో వచ్చిన టపాకాయ వకటి 'ఢాం' అంటూ పేలిపోయింది. సీతి వళ్ళోనుంచి వులిక్కి పడి పైకి లేచి పేలిన చోటుకు పరుగెత్తు కుంటూ పోయింది. సీతి ఆశించిన ప్రకారం అక్కడ టపాకాయ వక్కటి గూడా కనపడ లేదు—అన్నీ రంగు కాగితం ముక్కలే. సీతి నాలుగు పక్కలా కలయచూచి, పారమ్మ వైపుకు గబగబా తిరిగి వచ్చేసింది 'టపాకాయ దొరకలేదే' అంటూ. పారమ్మ జుట్టు నిమురుతూ గోముగా 'అమ్మా...టపాకాయ వకటి యియ్యవే' అంటూ రాగం తీసింది. పారమ్మ జాలిగా పాపవంక చూస్తూ 'పిచ్చి పిల్ల—మనకు టపాకాయ లెందుకే...గొప్ప వాళ్ళకి గాని అవి' అంది. ఆ మాట ఎవరి నుద్దేశించి అందో పసిగట్టటానికి ఇంటావిడకు వక క్షణంగూడా పట్టలేదు.

'ఏం పారమ్మా....సీతి మటుకు టపాకాయలు పేల్చ గూడదా.... వరే గోపీ...యిటు రా. నాయనా, నాలుగు టపాకాయలు యిచ్చిపో' అంటూ బిగ్గరగా కేక వేసింది. వాకిట్లో నుంచి పరుగెత్తుకుంటూ వచ్చాడు గోపి తల్లి మాట వినబడగానే. పెంపుడు అయినంత మాత్రాన అతనిలో మార్పు ఏమీ రాలేదు. అందరి పిల్లల మాదిరి గానే పరు గెత్తుకుంటూ వచ్చాడు. 'ఏంటి పిన్నమ్మా' అని అరుస్తూ.

'పిన్నమ్మా అంటూ పిలవ వద్దని ఎన్ని సార్లు చెప్పాను... అమ్మా అని పిలవమని చెప్పలా...సీతి చూడు ఎంత ముద్దుగా పిలుస్తుందో.'

పారమ్మ కల్పించుకోక తప్పలేదు. 'సీతికి మిగతా వాళ్ళకి పోల్చ కండి దయచేసి ...నా బిడ్డ నన్ను అమ్మా అని పిలవటంలో ఆశ్చర్యం ఏమి లేదు.'

గోపి వెంటనే అందుకుని 'అవును పిన్నమ్మా...సీతి పారమ్మ పిల్ల కాబట్టి అమ్మా అని పిలుస్తుంది. రామాపురంలో మా అమ్మని 'అమ్మా' అని నేనుమటుకు పిలవనేంటి' అన్నాడు చేతిలో టపాకాయలు జారి పడకుండా పట్టుకుంటూ...

'పోన్లేరా గోపీ...నాలుగు టపాకాయలు సీతి కివ్వవూ...పేలు స్తుందిట' అంది గోపి వంకచూస్తూ. సీతి ఆశగా అతని వంక చూసింది. 'నన్నెవరు అడిగా రేమిటి యివ్వటానికి? సీతి అడిగితే యిస్తా' అన్నాడు. పారమ్మ వళ్ళో కూర్చున్న సీతి వంకచూస్తూ. సీతి బుంగ ముఖం పెట్టి 'నేనెవ్వర్నీ అడగను...మా అమ్మను తప్ప...చూడవే' అంటూ పారమ్మ గడ్డం పట్టుకుని అడిగింది.

'అట్లా అనగూడదు తప్పమ్మా, గోపీ మీ అన్నయ్యగాదూ... అదే అన్నయ్యలాంటి వాడుగదూ—పిచ్చి పిల్లలాగా అన్నయ్యను అడగ టానికి భయపడుతారా ఎవరన్నా' అంది. సీతి గోపి వంక ఎంతో ఆప్యాయంగా చూసింది. ఇంటావిడ గోపి వంక చుర చురా చూసింది. విన్నటి దాక యిల్లు కసువు వూడ్చిన పని మనిషి తనతో చుట్టరికం కలిపి మాట్లాడటం ఎంతో అవమాన కరంగా తోచింది. గబుక్కున

కూర్చున్న దల్లా లేచి వచ్చి గోపిని నాలుగు దెబ్బలు వేసి 'ఇక్కడి నుంచి పో...టపాకాయలు వద్దు, ఏమీ వద్దు' అంది. సీతి అతని వంక చూస్తూ 'అన్నా నాకో టపాకాయ ఇయ్యవూ' అంది పారమ్మ వంక సరిగ్గా అడిగానా లేదా అన్నట్లు చూస్తూ' సీతి పారమ్మ వళ్ళోనుంచి లేచి గోపీ దగ్గరకు వెళ్ళింది.

'వద్దు సీతా, నీకు కాల్చటం సరిగ్గా చేతకాదు...నేను కాలుస్తాగా చూడు' అంటూ చేతులోవున్న సీమ టపాకాయను ఎడం చేతిలోవున్న కొబ్బరి పీచు నిప్పుకు అంటించి ఎగర వేశాడు—అది గాలిలోనే 'ఢాం' అంటూ పేలింది. సీతికి అందులో సంతృప్తి కలగలేదు. తన చేతి తోనే కాలుస్తే గాని ఆ ఆనందం వచ్చేటట్లు లేదు. గోపి చొక్కా పట్టుకుని 'అన్నయ్యా నాకోటియ్యవూ' అంది. ఇంటావిడ గబగబా గోపిని ఇంకో నాలుగు బాది 'బయటకు పొమ్మని చెప్పలా' అంది. పారమ్మ ఉండబట్టలేక పోయింది.

'ఏమమ్మా...అన్నయ్యా అని పిలవటం గూడా తప్పేనా... బయటికొచ్చి ప్రపంచంలోని మనుష్యులంతా అన్న దమ్ములవంటి వాళ్ళని, అంతా వకటేనని ఉపన్యాసం చెపుతారుగా' అంది. ఇంటావిడ అభిమానం దెబ్బతింది. తననింత ఎదిరించి అడుగుతుందని కలలోగూడా తలచ లేదు. రెక్కలు వచ్చిన పక్షి, గూడు నంటి పెట్టుకుని ఎంత మాత్రమూ వుండదని యింటావిడకు బొత్తిగా తెలియదు.

'ఇందాకటి నుంచి ఏదో మాట్లాడు తున్నావుగదా అని వూరు కుంటే మరీ యిదిగా వుందే. ఇంట్లో వక్క క్షణం గూడ వుండక్క ర్లేదు...ఫో అవతలకి' అంది వీధి వాకిలి వైపు వేలు పెట్టి చూస్తూ. పారమ్మ లేచి నిలబడింది సీతిని దగ్గరకు తీసుకుని—

'పోతాను అమ్మగారూ...యిప్పుడే పోతాను...పోయే ముందు అయ్యగారితో వక్కసారి మాట్లాడాలని వుంది...ఆ వక్కటి అనుగ్ర హించండి' అంది కరుణగా చూస్తూ.

'అయ్యగారితో నీకేంపని? నీకు రావలసిన పైకం తెచ్చి ముఖాన పారేస్తాను...మళ్ళీ యింటికి ముఖం చూపించకు. నీ కిక్కడేం పనే...

వాకిట్లోకి పద ..' అని గట్టిగా అరుస్తూ, ఇంటిలోకి పెద్ద పెద్ద అంగలతో వెళ్ళిపోయింది. పారమ్మ నిరామయంగా నాలుగు వైపులా చూచి 'పాపిష్టిదానా...టపాకాయలు నే నిస్తానంటే విన్నావుటే...కాసేపట్లో ఏం కొంప మునిగిపోయిందని' అంటూ చేతికొద్దీ కొట్టింది. 'అడగనే... అడగనే' అంటూ సీతి ఎంతగా అరుస్తున్నా, ఎర్రగా చెయ్యి కంది పోగానే, అంతవరకు యింటి లోపలి వైపు చూస్తున్న పారమ్మ సీతిని ఎత్తుకుని కన్నీరు సీతి తలపైన జల జలా రాలుస్తూ 'పాపిష్టిదాన్ని— నిన్ను ఎన్ని కొట్టానే' అంటూనే వీపుమీద చెయ్యివేసి నిమిరింది. కదుము గట్టిన వీపు మీద చెయ్యి తగలగానే సీతి 'అమ్మా' అంటూ బిగ్గరగా బావురు మంది.

'ఏమయింది, ఏమయింది' అంటూ వాకిట్లోనుంచి గబగబా పరు గెత్తుకు వచ్చాడు మాధవరావు. అతనే యింటి యజమాని. పారమ్మ అతన్నిచూసి నిర్లక్ష్యంగా పాప తలను మూర్కొన్నది. అతను పారమ్మ దగ్గరగా వచ్చి—

'పారమ్మా...పాపను అంతగా బాదుకుంటావు దేనికి?...చేతులు వూరుకోవూ' అన్నాడు. పాపను అతని చేతుల్లోకి తీసుకుందా మను కున్నాడు. అతనిలో సీతి మీద వాత్సల్యం నిండిపోయి, పొంగి పై కొస్తోంది. మాధవరావు యింకా సన్నిహితంగా వెళ్ళాడు. పారమ్మ నాలుగడుగులు వెనక్కు వేసి—

'పని చాలించుకున్నాను. వెళ్ళిపోతూ చెప్పి పోదామని వచ్చాను' అంది బింకంగా. మాధవరావు చలించి పోయాడు. చేతిలోని సంచి జారిపోయి నేలమీద దబుక్కున పడిపోయింది.

'ఎక్కడికి వెళ్తావు పార్వతీ...ఎప్పుడు ఈ నిర్ణయానికి వచ్చావు?' అన్నాడు ఆదుర్దాగా.

'క్షమించండి...నా పేరు పారమ్మ....నా పార్వతి వుండే చోటికి వెళ్ళి పోతున్నాను...పారమ్మ చచ్చిపోయింది' అంది. అమ్మ బుజాన వ్రేలాడుతున్న సీతి 'పారమ్మ చచ్చిపోయింది' అన్నమాట విని పారమ్మను వీపుమీద బాదుతూ, 'మీ అమ్మ చచ్చిపోదు...యిక్కడే

వుంది... ఈ, ఈ,' అంటూ ఏడుపు మొదలు పెట్టింది. పారమ్మ సీతి తలను ముద్దుపెట్టుకుని 'పారమ్మ చచ్చిపోయినా మీ అమ్మ నీ దగ్గిరే వుంటుందే...మీ అమ్మకు చావులేదు' అంది. మాధవరావు ఏమి మాట్లాడాలో తోచక యింటి వాకిలివైపు చూస్తున్నాడు భార్య అటువైపు వస్తుందేమో నన్న భయంతో.

'ఎంత మారిపోయావు...వక్క రాత్రిలో...యిక్కడ నీకేమి లోపం అనీ...పాపకు చొక్కా తెచ్చాను చూడు' అంటూ కిందపడ్డ సంచిలోనుంచి పూల గౌను వకటి బయటకు తీసి 'యిది నీకోసమేనే సీతి...బాగుందా?' అన్నాడు. సీతి గౌను వంకచూడకుండానే—

'నా కక్కర్లేదు. మా అమ్మ యిస్తే తప్ప యింకెవరిచ్చినా నాకొద్దు' అంది తల్లి జుట్టును తన వేళ్ళ సందులోకి తీసుకుని మెలికలు వేస్తూ.

'అట్లా అనకూడదమ్మా. నేను చెప్పినప్పుడు తీసుకోవచ్చు... కావాలంటే అమ్మనడుగు' అన్నాడు మాధవరావు పారమ్మ వంక ఆశగా చూస్తూ. పారమ్మ అతని కళ్ళలోకి చూసింది. సిగ్గుతో కుంచించుకు పోయాడు మాధవరావు. దైన్యంగా ఆమె వంక చూస్తూ 'తీసుకోమని చెప్పవూ' అన్నాడు. పారమ్మ సీతిని కిందకు దింపి-

'చొక్కా యివ్వండి....నా చేతితోనే తొడుగుతాను' అంది.

'అల్లా వీల్లేదు పారమ్మా...నా చేత్తో నేనే తొడగాలి. ఆ మాత్రం అవకాశం కలిగించవూ' అన్నాడు. పారమ్మ నీరసంగా నవ్వి—

'మీ రడిగిన ఏ విషయానికి అవకాశం కల్పించలేదు గనక! అయ్యగారిచ్చినప్పుడు తీసుకోవాలి...అయ్య చెప్పినమాట వినాలి, అంది. అయ్య అంటున్నపుడు ఆమె గాత్రం గీరపోయింది. సీతి కనురెప్ప పాటు మాధవరావు వంక చూసింది. తనింటి పక్క గుడిసెలో వుంటున్న రంగి వాళ్ళ నాన్నను అయ్యా అంటూ పిలవటం అనేకమార్లు విన్నది. ఆ పిలుపులో వున్న ఆనందం చూరగొనే అవకాశం కలగనే లేదు సీతికి. చక చకా మాధవరావు కాళ్ళ దగ్గరకు వెళ్ళి 'అయ్యా

చౌకా ఇయ్యవే' అంది. పారమ్మ వైపుకుతిరిగి 'యిందాక అయ్యో లేదని చెప్పావు అన్నీ అబద్ధాలే' అంది. మాధవరావు పారమ్మ వైపు చూడకుండానే పావకు గొను తొడిగేశాడు. రెండడుగులు వెనక్కి వేసి సీతినిచూచాడు. చేతులు చాచి తనవైపు చూస్తోంది. ఎత్తుకుని మనసారా ముద్దుపెట్టుకున్నాడు. 'సీతి చాలా మంచిపిల్ల' అన్నాడు. అవునన్నట్లు తల వూపింది సీతి. వీపు మీద చెయ్యి తగలగానే కెవ్వుమని కేక పెట్టబోయి పారమ్మను చూచి వూరుకుంది. 'అయ్యో నాకు టపాకాయలు ఇయ్యవా'...అంది. పారమ్మ అందుకుని 'యిందాక అన్ని కొట్టినా అప్పుడే మర్చిపోయ్యావా...టపాకాయలు కావలసి వచ్చాయిటే' అంటూ గదమాయించింది. సీతి మాధవరావు భుజం నుంచి కిందకు జారివచ్చి పారమ్మను కౌగలించుకుని 'యింక అడగనే' అంది వెక్కి వెక్కి ఏడుస్తూ.

డాబా మీదనుంచి టపాకాయ ఒకటి వచ్చి వాళ్ళముందర పేలింది. ఎన్నో రంగు కాగితం ముక్కలు యధా ప్రకారం వెక్కిరిస్తూ కన పడ్డాయి. సీతి శ్రుతి బాగా పెంచి ఏడవటం మొదలుపెట్టింది. మాధవ రావు పంచె పట్టుకుని వీధివైపు నాలుగడుగులు వేసి 'వరేయి గోపి సీతికి నాలుగు టపాకాయ లివ్వరా' అంటూ కేకవేశాడు. 'అన్నీ అయి పోయినాయి' అంటూ పైనుంచి సమాధానం వచ్చింది. సీతి ఏడుపు ఇంకా ఎక్కువచేసింది.

ఇంటావిడ వురుక్కుంటూ బయటకు వచ్చి 'యిదుగో తల్లీ నీకు రావలసిన డబ్బులు-యింక పో బయటికి' అంది. ఆవిడ దృష్టిలో గొను ముందరగా కనపడింది. మాధవరావు వంక చుర చురా చూసి 'అలికి మనుష్యులకు ఎంత చేసినా వుపయోగం లేదండి...మళ్ళీ మననే కరవొస్తారు' అంది.

'ఏమిటి మనింట్లో పని చెయ్యటానికి రాగానే అలికి మనుష్యులయి పోయారేం...కులం తక్కువనా...గుణం తక్కువనా' అంటూ పళ్ళు పటపట లాడించాడు మాధవరావు.

'ఆ...అన్నీ తక్కువే...మనతో పాటి పోల్చేవాళ్లూ...వాళ్ళకి గూడా ఈ మేడలోనే ఒక భాగం వుండటానికి ఇయ్యక పోయారు. మనతోపాటు తిని తిరిగే వాళ్లు'... మాటల్లో ఎకసెక్కెం తీవ్రంగా ధ్వనిస్తోంది. పారమ్మ వినలేక చెవులు మూసుకుంది.

'ఆ పని చేద్దామనుకుంటున్నాను. ఇక నీ ఆటలు సాగే రోజులు పోయినాయి.... సీతిని ఈ రోజు నుంచీ పెంచుకుంటాను. మనింట్లోనే వుంటుంది. గోపీని పంపిచేస్తున్నాను వాళ్ళ యింటికి,' గోపీ క్రౌర్యంగా అందరి వంకా చూస్తూ ఇంట్లోకి వెళ్ళి సంచీ, కోటు పడేసి, మళ్ళీ వాకిట్లోకి వచ్చాడు. ఇంటావిడ 'అయ్యో....అయ్యో అంటూ నోరు నొక్కుకుంటోంది. సీతి ఇంకా బిగ్గరగా ఏడుస్తోంది. పారమ్మ నిశ్చేష్టురాలయింది.

'ఏం వీల్లేదు....మొగుడు లేని దాని పిల్లను తెచ్చి పెంచుకోవటానికి ససేమిరా వప్పుకోను. వీళ్ళ మొహం మళ్ళీ కనపడటానికి వీల్లేదు. పొండి....మీరంతా బయటకు' అంటూ బిగ్గరగా అరుస్తూ పారమ్మను భుజం పట్టుకు బయటకు తోసింది.

'ఆగండి అమ్మ గారూ....మీ యింట్లో పనికి వచ్చానుగదా అని మాటలంటే పడనని ఇందాకనే చెప్పాను. అదేమాట నా నోటివెంట నాలుగుసార్లు రానీయకండి. నాకు మొగుడున్నాడు....ఉండేవాడు...నా సంగతి నాకు తెలుసు' దుఃఖం పొర్లివస్తున్న దానిని మింగుకుంటూ 'యిప్పుడు లేడండి అమ్మగారూ...చచ్చిపోయాడు' అని బిగ్గరగా పసి పిల్లవలె రోదించటం ప్రారంభించింది. మాధవరావు అస్పష్టంగా గొణిగాడు. 'లేదు...చచ్చిపోలేదు' అంటూ.

'అవన్నీ నా కక్కర్లేదు...నీ మొహం నాకు చూపించ నక్కర లేదు....నీ డబ్బులు నీ కిచ్చాగా. యింక వెళ్ళిపోవచ్చు...' అంది. వీధి వాకిలి వైపు భుజం పెట్టి మెల్లిగా తోస్తూ. పారమ్మ చలించలేదు. సీతిని చంకలోకి తీసుకుని 'అయ్యకు దణ్ణం పెట్టమ్మా' అంది సీతి రెండు చేతులుకలిపి మాధవరావు వంకచూస్తూ.

'అమ్మా...అయ్య ఉన్నాడన్నావుగదే యిందాక' అంది సీతి అమాయకంగా. పొంగి వస్తున్న దుఃఖాన్ని కడుపులోనే మింగుకుని 'లేదమ్మా మీ అయ్య చచ్చిపోయాడు...ఈయన మీ అయ్యగాదు' అంది. సీతి 'అయ్యా...అయ్యా అంటూ రాగం ప్రారంభించింది.

పారమ్మ సీతిని భుజం మీదనుంచి కిందకు దింపేసింది. నింపాదిగా ఎవరినీ గమనించ కుండానే లోగిలిలోవున్న మంచిగం దగ్గరకు పోయి, ముఖాన వున్న కుంకుమను చేతిలోకి దులుపుకుంది. బొటనవేలు కన్నీటితో తడిపి, కుంకుమకు అద్దుకుంది. కుంకుమనంతా మండిగానికి పట్టించేసి మాధవరావు వంక చూసి 'నా కుంకుమను ఇచ్చి పోదామనే వచ్చాను...దానితో పని నాకు ఈ రోజుతో తీరిపోయింది' అంది. ఇంటావిడ నోరు నొక్కుకుంటూ 'ఆ కుంకుమ నా కొంప కెందుకే నువ్వే తీసుకుపో' అంటూ వక చెంబెడు నీళ్లు మంచిగం మీద కొట్టింది. కుంకుమ, పసుపు కలిసిన రంగు నీళ్లు గడపల మీదకుండా కిందకి జారినాయి. పారమ్మ ఆ రంగు నీళ్ళలో తన బింబాన్ని చూచుకుని కంట తడిపెట్టింది. మాధవరావు 'అదేమిటే పారమ్మా, యిదంతా ఏమిటి. ఎక్కడికి పోతున్నావు...యిక్కడివన్నీ విడిచిపెట్టి' అన్నాడు.

'ఇక్కడ నాకేమీ లేవు...నా జీవితం అంతా యిక్కడే హరించి పోయింది. నా సీతి జీవితంగూడా యిలాగే నికృష్టంగా నాశనం చెయ్యటం నాకిష్టం లేదు...ఏ దూర తీరానికో తీసుకుపోతాను... నా కడ్డు రానియ్యకండి' అంది.

'కొత్త గౌను తీసుకున్నది గాకుండా...పైగా డబ్బులు గూడా ఎందుకు...పద—యిక నీదారికెవరూ అడ్డురారులే' అంది యింటావిడ గడప మీద పెట్టిన డబ్బులు కొంగులో పెట్టి ముడివేసుకుంటూ.

'నా వక్క మాట విను పారమ్మా...సీతిని నేను పెంచుకుంటా. దానికి ఎటువంటి లోపం కలుగనియ్యను' అన్నాడు మాధవరావు.

'మీ రింతవరకు ఎటువంటి లోపం కలుగ నిచ్చారు గనుక... తల్లినీ పిల్లని వేరు చేద్దామనుకుంటున్నారా' అంది. ఈ సారి మాటలు కఠినంగానే వచ్చినాయి. మాధవరావు తడబడ్డాడు, సీతిని వకసారి

తీసుకుని ముద్దు పెట్టుకుందా మనుకున్నాడు. భార్య రాక్షసిలాగా కనపడింది. పారమ్మ పసిదాని చేతులు మళ్ళీ కలుపుతూ 'అయ్యగారికి దణ్ణం పెట్టు' అంది సీతి కనులలోకి సూటిగా చూస్తూ. మాధవరావు దిగ్గరగా రొప్పుతూ, 'పొండి...అంతా పొండి...నా జీవితంలో ఎవరూ అక్కర్లేదు!' అంటూ యింటిలోకి పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు. ఇంటావిడ డబ్బులు కట్టిన ముడిని నడుముకు చుట్టుకుని పారమ్మను, సీతిని వాకిటిదాకా సాగనంపి గొళ్ళెం వేసింది.

సీతి వీధిలోకి అడుగు పెడుతూనే ఎర్రటి వస్తువు వకదాన్ని చూచి, గబగబా చేతుల్లోకి తీసుకుంది. అన్ని వైపులా పరీక్ష చేసి పారమ్మ వైపుకు చూపిస్తూ 'అమ్మా టపాకాయ దొరికిందే' అంది ఆనందం పట్టలేక. పారమ్మ దానిని తన చేతిలోకి తీసుకుని చూచింది. సీతిని చంకలోకి తీసుకుని, హృదయానికి హత్తుకుంటూ, 'ఈ టపాకాయ మోగదమ్మా' అంది. సీతి వలవలా ఏడుస్తూ, 'ఛీ నాకిది వద్దే' అంటూ యింకా గట్టిగా కౌగలించుకుని బావురుమంది.

'అట్లా ఏడవగూడదమ్మా...నీకు మంచి టపాకాయ నేను తెచ్చి పెడతాగా' అంది పారమ్మ బరువుగా అడుగులు వేస్తూ.



# పూవులు - కాయలు

'ఏమండోయి చూశారా...పొట్ల తీగెకి మొగ్గ వస్తోంది' అంది జానకి.

"పొద్దున చూస్తే లేదుగా జానకీ...ఎదీ లాంతరు తీసుకురా...' అంటూ రాఘవయ్య ఇంట్లోకి వస్తూనే ఆదుర్దాగా దొడ్లోకి వెళ్ళాడు. జానకి లాంతరు తెచ్చి పాదు దగ్గరగా పెట్టి 'వేలుపెట్టి చూపించేరు జాగ్రత్త...వేలు గుప్పిటలోంచి రావాలి....' అంది.

రాఘవయ్య లాంతరు తీసుకుని పాదు చుట్టూ తిరిగి ఒక్కసారి కళ్ళు మూసుకుని 'పద జానకి...కనపడింది తొందరగా పద అంతసేపు గుడ్లప్పగించి చూస్తావెందుకు ' అంటూ జానకి బుజంమీద చెయ్యి వేసి ఇంట్లోకి మెల్లగా వచ్చాడు.

'చూశావామరి...దిష్టిబొమ్మ. దిష్టిబొమ్మ అని పెద్ద ఆర్భాటం చేశేవు...అంతా ఏమిటా అని చూడటానికి వస్తారు...వట్టి సున్నపు నీళ్ళు చల్లితేసరి...ఏమంటావు...'అన్నాడు సంప్రదింపుగా. జానకి నవ్వుతూ 'అంత లేత మొక్క...సున్నపు నీళ్ళు చల్లితేఘాటు గదండీ... ఘుది మరీ చోద్యం' అంది.

జానకి ఆ రాత్రి ఎంతో తృప్తిగా, నిశ్చింతంగా నిద్రపోయింది. రాఘవయ్య రోజూ కలవరించేవాడు, ఆ రోజు కలత నిద్రగా గూడా అనిపించలేదు.

తెల్లవారుతుండగా ఎవరో కాళ్ళు తాకినట్లు అనిపిస్తే ఉలిక్కిపడి లేచాడు. జానకి అతని పాదాలకు నమస్కరిస్తోంది. మనస్సులోనే ఆమెను ఆశీర్వదించి మళ్ళీ దుప్పటి పైకి లాక్కుని పడుకున్నాడు.

జానకి మనస్సుకు ఎంతో వేదనగా ఉంది. మాటిమాటికీ పొట్ల పాదు దగ్గరకుపోయి కొత్తగా తొడుక్కుంటున్న మొగ్గను చూద్దామని ఆరాటం. అన్నిసార్లు అదే పనిగా చూడగూడదని, ఆరాత్రే రాఘవయ్య అన్నమాట ఆమె మనస్సులో మెదులుతునేవున్నది. అయినప్పటికీ

ఏదో పని వంక పెట్టుకుని పాదు దగ్గరకుపోయి సూటిగా చూడకుండా ఓరగా ఆ మొగ్గవంక చూస్తూ వచ్చింది.

రాఘవయ్యకు బాగా మెలకువ రాగానే ఒకసారి కళ్ళుతుడుచుకుని గబగబా మంచందిగి పాదు దగ్గరకు పోయి ఎవరూ తన్ను చూడలేదన్న సంతృప్తితో ఇంట్లోకి అదే వేగంలో తిరిగివచ్చాడు. జానకి చూసినా ఎరగనట్లు మాట్లాడుతూ వచ్చింది.

ఆ రోజునుంచి రాఘవయ్య బజారు పని ముగించుకొని సాయంత్రం ఇంటికి రాగానే ఆ మొగ్గ ఎలా పెరుగుతూవచ్చిందీ దాని తర్వాత తీగెమీద ఎన్ని మొగ్గలు మొలిచిందీ అన్నీ వివరంగా చెపుతూ వచ్చింది జానకి. ఒక తీగె పట్టుకోసం పక్కనేవున్న గోడను ఆధారం చేసుకుని పాకుతోంది. అక్కడ చిన్న మేకులుకొట్టి గోడమీద పురికోసతో జాలు అల్లింది. ఆ సంగతి రాఘవయ్యకు చెప్పింది. ఆలా కాదని ఆ రోజు రాత్రిపూటనే ఇంట్లో పాత వాసం వుంటే బద్దలుచీల్చి ఆ పాదుకు నాలుగు పక్కలా పాతినవారు ముక్కలతోనూ, నులకతాళ్లతోనూ పందిరి అల్లాడు.

గోడమీదకు పాకుతున్న తీగెను పందిర మీదకు మరలించటం చాలా కష్టమయింది. గోడ ఇటికల మధ్య మన్నులో తీగె చొచ్చుకు పోయింది. రాఘవయ్య బలవంతానా తీగెను లాగేసి పందిరకు తగిలిస్తే అదే అల్లుకుంటుందన్నాడు. మెల్లిగా వీలయితేనే తీయమంది జానకి. తీగెను పందిరమీదకు అల్లించ వలసిన అవశ్యకతను గూర్చి నచ్చ చెప్పాడు. ససేమిరా వీల్లేదంది జానకి. ఆ లేతతీగ తెగిపోతే తను చూడలేనంది. ఇంట్లోకిపోయి వల వలా ఏడ్చి కళ్లు ఎర్రచేసుకుంది. రాఘవయ్య పనిపూర్తిచేసుకుని ఇంట్లోకి వచ్చి జానకి ముఖం కందడం చూసి 'తప్పుకాదూ!' అన్నాడు. 'ఊ...' అంది జానకి.

రాఘవయ్య నిద్రపోయాక జానకి లాంతరు లేకుండా పొట్లపాదు దగ్గరకుపోయి పందిరవైపుకు పోతున్న తీగెను చూసింది. ఆమెకు దుఃఖం పొర్లుకు వచ్చింది. గోడమీదకు వచ్చినతీగె కనిపించలేదు.

బహుశా విరిగిపోయి వుంటుంది. లాంతరు వుంటేనే కాని కనపడదు. తనందుకునే వచ్చేటప్పుడు లాంతరు తెచ్చుకోలేదు.

ఆ పువ్వు పూసింది. జానకి ఆనాడు ఇంట్లో పరమాణ్ణం చేసింది. బజ్జీలు వండింది. ఇరుగు పొరుగువారిని భోజనానికి పిలిచింది. ఏమి టని అడిగిన వారికి 'తన పుట్టినరోజు'ని చెప్పింది. ఇంత వయసు వచ్చి పుట్టిన రోజు పండగేమిటని కొందరు తికమకపడ్డారు. పుట్టిన రోజంటే ఏమిటో వారికి అర్థంకాదు అనుకుంది జానకి.

రాఘవయ్య ఆ రోజుకు పని మానుకున్నాడు. పగలల్లా గదిలో కిటికీ దగ్గర కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నట్లు కాగితాలు ముందర వేసు కుని చువ్వల మధ్యనించి పొట్లపాదు మధ్యలో వికసించిన ఆ పువ్వు వంకనే చూస్తున్నాడు. తెల్లటి తెలుపు ఆ సువాసన నాసికాగ్రాన్ని చేర కోలేకపోయినా అతన్ని మత్తెక్కించి వేస్తోంది. జానకి అరుబయట వరండాలో రాట్నం వడుకుతూ కూర్చుని మధ్య మధ్య పొట్లపాదువంక దృష్టిని ప్రసరింపజేస్తోంది.

"ఏమండీ...ఏదో వ్రాసుకుంటున్నట్లున్నారు"

అబ్బే...ఏంలేదు. అయినా జానకీ ఇవ్వాళ మంగళవారం కదూ, రాట్నం వడుకుతున్నావేం"

"ఏం...ఎందుకని వడకకూడదు?"

జానకి, రాఘవయ్యలు ఏమి మాట్లాడుకోవాలో తెలియలేదు. వారు భరించలేనంత ఆనందం వారి హృదయంలో తిష్టవేసి వారిని విహ్వలత పొందిస్తున్నది. 'ఆ పువ్వుకి ఎన్ని రేకలున్నాయో చూశారా. ఆరుగదూ...అన్నింటికీ అంతే వుంటాయి గదండీ...'

'అది సరేగానీ...చెట్టు మొదట్లో ఆకులు వాడిపోతున్నాయేమిటో చూశావా'

అవునండీ...శాస్త్రం ఇంత పెరిగింది కదా...దానికేం మందులుం

ఇద్దరూ కల్పించుకున్న పనులను మానేసి పాదు దగ్గరకు చేరారు. ఎంతో ఆసక్తితో పువ్వువంక చూశారు. రేకలు ముకుళించుకుని లోపలకు కొద్దిగా వంగినాయి.

'మధ్యాహ్నం చూశారా...వక్కడే తేనెటీగ ఎన్నిసార్లు వచ్చిందనుకున్నారు. మరీ మొరటుతనం...అప్పుడే పువ్వు నలిగిపోయింది అంది జానకి.

'సరేగాని జానకి...ఎన్ని గబ్బుచీమలు పట్టినాయో చూశావా!' అంటూ పువ్వుమీద మెల్లగా ఊదడం ప్రారంభించాడు.

'ఊరుకోండి మరీను...పువ్వు ఎలా వూగుతోందో....అట్లాగే గట్టిగావూదితే ఇదికాస్తా రాలిపోతుంది' అంది జానకి. రాఘవయ్య ఆమెవంక తీవ్రంగా చూశాడు. జానకి కొద్దిగా జంకి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

ఆరోజు సాయంత్రం ఎవ్వరూ పాదు దగ్గరకు పోరాదని ఒక శపధంచేసుకున్నారు. రాఘవయ్య బజారులో పిచ్చి వాడిలా ఎక్కడెక్కడో తిరిగివచ్చాడు. జానకి వంటింటిలోనుంచి బయటకు రానేలేదు.

'ఇవ్వాళ పొద్దున చూద్దామా' అని అడిగింది జానకి మంచంమీదికి వస్తూ. 'అట్లాగే!' అన్నాడు రాఘవయ్య.

తెల్లవారుజామున నాలుగింటికే లేచిన రాఘవయ్య జానకి మంచం మీద లేకపోవటం చూచి ఆశ్చర్యపోయాడు. ధబుక్కున లేచి చూచాడు. జానకి పాదు దగ్గర లాంతరుపెట్టుకుని కూర్చుంది. ఒక క్షణం ఆగి తనూ పాదు దగ్గరకు పోయాడు. జానకి విస్తుపోలేదు.

"పువ్వు రాలిపోయింది చూచారా" అంది గద్గదమైన స్వరంతో. అతను తలవంచుకుని 'నేను చూసేదేముంది' అంటూ వచ్చినవాడు వచ్చినట్లుగా మంచంమీదకుపోయి పడుకున్నాడు. జానకి కూడా వచ్చేసి 'నాకెందుకనో భయంగా వుందండి' అంది.

'ఎందుకు భయం....పిచ్చిదానా....' అన్నాడు. జానకి అతనిమీదకు ఒరిగిపోయి 'పిచ్చిదాన్ని అయిపోయినా బాగుండేది....' అంటూ పసిపిల్లలా ఏడ్చింది.

బహుశా విరిగిపోయి వుంటుంది. లాంతరు వుంటేనే కాని కనపడదు. తనందుకనే వచ్చేటప్పుడు లాంతరు తెచ్చుకోలేదు.

ఆ పుష్పం పూసింది. జానకి ఆనాడు ఇంట్లో పరమాన్నం చేసింది. బజ్జీలు వండింది. ఇరుగు పొరుగువారిని భోజనానికి పిలిచింది. ఏమి టని అడిగిన వారికి 'తన పుట్టినరోజ'ని చెప్పింది. ఇంత వయసు వచ్చి పుట్టిన రోజు పండగేమిటని కొందరు తికమకపడ్డారు. పుట్టిన రోజంటే ఏమిటో వారికి అర్థంకాదు అనుకుంది జానకి.

రాఘవయ్య ఆ రోజుకు పని మానుకున్నాడు. పగలల్లా గదిలో కిటికీ దగ్గర కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నట్లు కాగితాలు ముందర వేసు కుని చువ్వల మధ్యనించి పొట్లపాదు మధ్యలో వికసించిన ఆ పుష్పం వంకనే చూస్తున్నాడు. తెల్లటి రెమ్మ ఆ సువాసన నాసికాగ్రాన్ని చేరు కోలేకపోయినా అతన్ని పులకరింపచేస్తోంది. జానకి ఆరుబయట వరండాలో రాట్నం వడుకుతూ కూర్చుని మధ్య మధ్య పొట్లపాదువంక దృష్టిని పరిసరింపజేస్తోంది.

"ఏమండీ...ఏదో వ్రాసుకుంటున్నట్లున్నారు"

"అబ్బే...ఏంలేదు. అయినా జానకీ ఇవ్వాళ మంగళవారం కదూ, రాట్నం వడుకుతున్నావేం"

"ఏం...ఎందుకని వడకకూడదు?"

జానకి, రాఘవయ్యలు ఏమి మాట్లాడుకోవాలో తెలియలేదు. వారు భరించలేనంత ఆనందం వారి హృదయంలో తిష్టవేసి వారిని విహ్వలత పొందిస్తున్నది. 'ఆ పుష్పానికి ఎన్ని రేకలున్నాయో చూశారా. అరుగుమా...అన్నింటికీ అంచే వుంటాయి గదండీ...'

'అది సరేగాని...చెట్టు మొదట్లో ఆకులు వాడిపోతున్నాయేమిటో చూశావా'

'అవునండీ...శాస్త్రం ఇంత పెరిగింది కదా...దానికేం మందులుం డవుటండీ'

ఇద్దరూ కల్పించుకున్న పనులను మానేసి పాదు దగ్గరకు చేరారు. ఎంతో ఆసక్తితో పువ్వువంక చూశారు. రేకలు ముకుళించుకుని లోపలకు కొద్దిగా వంగినాయి.

'మధ్యాహ్నం చూశారా...పక్కచే తేనెటీగ ఎన్నిసార్లు వచ్చిందనుకున్నారు. మరీ మొరటుతనం...అప్పుడే పువ్వు నలిగిపోయింది' అంది జానకి.

'సరేగాని జానకి...ఎన్ని గబ్బుచీమలు పట్టినాయో చూశావా!' అంటూ పువ్వుమీద మెల్లగా ఊదడం ప్రారంభించాడు.

'ఊరుకోండి మరీను...పువ్వు ఎలా వూగుతోందో....అట్లాగే గట్టిగావూదితే ఇదికాస్తా రాలిపోతుంది' అంది జానకి. రాఘవయ్య ఆమెవంక తీవ్రంగా చూశాడు. జానకి కొద్దిగా జంకి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

ఆరోజు సాయంత్రం ఎవ్వరూ పాదు దగ్గరకు పోరాదని ఒక శపథంచేసుకున్నారు. రాఘవయ్య బజారులో పిచ్చి వాడిలా ఎక్కడెక్కడో తిరిగివచ్చాడు. జానకి వంటింటిలోనుంచి బయటకు రానేలేదు.

'ఇవ్వాళ పొద్దున చూద్దామా' అని అడిగింది జానకి మంచంమీదికి వస్తూ. 'అట్లాగే!' అన్నాడు రాఘవయ్య.

తెల్లవారుజామున నాలుగింటికే లేచిన రాఘవయ్య జానకి మంచం మీద లేకపోవటం చూచి ఆశ్చర్యపోయాడు. ధబుక్కున లేచి చూచాడు. జానకి పాదు దగ్గర లాంతరుపెట్టుకుని కూర్చుంది. ఒక క్షణం ఆగి తనూ పాదు దగ్గరకు పోయాడు. జానకి విస్తుపోలేదు.

"పువ్వు రాలిపోయింది చూచారా" అంది గద్గదమైన స్వరంతో

ఆతను తలవంచుకుని 'నేను చూసేదేముంది' అంటూ వచ్చినవాడు వచ్చినట్లుగా మంచంమీదకుపోయి పడుకున్నాడు. జానకి కూడా వచ్చేసి 'నాకెందుకనో భయంగా వుంచంది' అంది.

'ఎందుకు భయం....పిచ్చిదానా....' అన్నాడు. జానకి అతనిమీదకు ఒరిగిపోయి 'పిచ్చిదాన్ని అయిపోయినా బాగుండేది....' అంటూ పసిపిల్లలా ఏడ్చింది.

బహుశా విరిగిపోయి వుంటుంది. లాంతరు వుంటేనే కాని కనపడదు. తనందుకునే వచ్చేటప్పుడు లాంతరు తెచ్చుకోలేదు.

ఆ పువ్వు పూసింది. జానకి ఆనాడు ఇంట్లో పరమాణ్ణం చేసింది. బజ్జీలు వండింది. ఇరుగు పొరుగువారిని భోజనానికి పిలిచింది. ఏమి టని అడిగిన వారికి 'తన పుట్టినరోజ'ని చెప్పింది. ఇంత వయసు వచ్చి పుట్టిన రోజు పండగేమిటని కొందరు తికమకపడ్డారు. పుట్టిన రోజంటే ఏమిటో వారికి అర్థంకాదు అనుకుంది జానకి.

రాఘవయ్య ఆ రోజుకు పని మానుకున్నాడు. పగలల్లా గదిలో కిటికీ దగ్గర కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నట్లు కాగితాలు ముందర వేసు కుని చువ్వల మధ్యనించి పొట్లపాదు మధ్యలో వికసించిన ఆ పువ్వు వంకనే చూస్తున్నాడు. తెల్లటి తెలుపు ఆ సువాసన నాసికాగ్రాన్ని చేరు కోలేకపోయినా అతన్ని మత్తెక్కించి వేస్తోంది. జానకి అరుబయట వరండాలో రాట్నం వడుకుతూ కూర్చుని మధ్య మధ్య పొట్లపాదువంక దృష్టిని ప్రసరింపజేస్తోంది.

"ఏమండీ...ఏదో వ్రాసుకుంటున్నట్లున్నారు"

"అబ్బే...ఏంలేదు. అయినా జానకీ ఇవ్వాళ మంగళవారం కదూ, రాట్నం వడుకుతున్నావేం"

"ఏం...ఎందుకని వడకకూడదు?"

జానకి, రాఘవయ్యలు ఏమి మాట్లాడుకోవాలో తెలియలేదు. వారు భరించలేనంత ఆనందం వారి హృదయంలో తిష్టవేసి వారిని విహ్వలత పొందిస్తున్నది. 'ఆ పువ్వుకి ఎన్ని రేకలున్నాయో చూశారా. ఆరుగదూ...అన్నింటికీ అంతే వుంటాయి గదండీ...'

'అది సరేగానీ...చెట్టు మొదట్లో ఆకులు వాడిపోతున్నాయేమిటో చూశావా'

'అవునండీ...శాస్త్రం ఇంత పెరిగింది కదా...దానికేం మందులుం డవుటండీ'

ఇద్దరూ కల్పించుకున్న పనులను మానేసి పాదు దగ్గరకు చేరారు. ఎంతో ఆసక్తితో పువ్వువంక చూశారు. రేకలు ముకుళించుకుని లోపలకు కొద్దిగా వంగినాయి.

'మధ్యాహ్నం చూశారా...వక్కటే తేనెటీగ ఎన్నిసార్లు వచ్చిందనుకున్నారు. మరీ మొరటుతనం...అప్పుడే పువ్వు నలిగిపోయింది' అంది జానకి.

'సరేగాని జానకి...ఎన్ని గబ్బుచీమలు పట్టినాయో చూశావా!' అంటూ పువ్వుమీద మెల్లగా ఊదడం ప్రారంభించాడు.

'ఊరుకోండి మరీను...పువ్వు ఎలా వూగుతోందో....అట్లాగే గట్టిగావూదితే ఇదికాస్తా రాలిపోతుంది' అంది జానకి. రాఘవయ్య ఆమెవంక తీవ్రంగా చూశాడు. జానకి కొద్దిగా జంకి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

ఆరోజు సాయంత్రం ఎవ్వరూ పాదు దగ్గరకు పోరాదని ఒక శపథంచేసుకున్నారు. రాఘవయ్య బజారులో పిచ్చి వాడిలా ఎక్కడెక్కడో తిరిగివచ్చాడు. జానకి వంటింటిలోనుంచి బయటకు రానేలేదు.

'ఇవ్వాళ పొద్దున చూద్దామా' అని అడిగింది జానకి మంచంమీదికి వస్తూ. 'అట్లాగే!' అన్నాడు రాఘవయ్య.

తెల్లవారుజామున నాలుగింటికే లేచిన రాఘవయ్య జానకి మంచం మీద లేకపోవటం చూచి ఆశ్చర్యపోయాడు. ధుబుక్కున లేచి చూచాడు. జానకి పాదు దగ్గర లాంతరుపెట్టుకుని కూర్చుంది. ఒక క్షణం ఆగి తనూ పాదు దగ్గరకు పోయాడు. జానకి విస్తుపోలేదు.

"పువ్వు రాలిపోయింది చూచారా" అంది గద్గదమైన స్వరంతో. అతను తలవంచుకుని 'నేను చూసేదేముంది' అంటూ వచ్చినవాడు వచ్చినట్లుగా మంచంమీదకుపోయి పడుకున్నాడు. జానకి కూడా వచ్చేసి 'నాకెందుకనో భయంగా వుందండి' అంది.

'ఎందుకు భయం....పిచ్చిదానా....' అన్నాడు. జానకి అతనిమీదకు [illegible]రిగిపోయి 'పిచ్చిదాన్ని అయిపోయినా బాగుండేది....' అంటూ పసిపిల్లలా ఏడ్చింది.

వారు పాదుకి పూలు పూయటం అప్పటినుంచి తరుచుగా చూస్తు న్నారు. ఎన్నో పూలు పూస్తున్నాయి. ఒక్కటీ నిలవటంలేదు. మరు నాటి ఉదయానికల్లా రాలిపోతున్నాయి. జానకి వాటన్నిటినీ ఏరి పక సీసాలో పోస్తోంది. రాఘవయ్య ఎన్ని రకాలమందులో తెచ్చి వాడు తున్నాడు. ఒక్క పిందె పువ్వూ పడలేదు. పాదు పందిర అంతా అల్లుకు పోయి మల్లె పందిరెలా విరగపూస్తోంది. జానకి ఆ పాదు మొదట్లో కూర్చుని విలపిస్తూ 'నేను పాపిష్టిదాన్నయితే కావచ్చు కాని....నాచేతులేం పాపంచేసినాయి భగవాన్. ఈ పాదుకు వక్కకాయ కాయరాదూ....!' అంటూ ప్రశ్నించేది. రాఘవయ్య ఇంట్లోనే కూర్చుని 'నేను చేసుకున్న పాపానికి శిక్ష జానకి గూడా ఎందుకు అనుభవించాలి....!' అని గొణు గుతూ వుండేవాడు.

ఒకరోజు రాఘవయ్య బాగా పొద్దు క్రుంకిన తర్వాత ఇంటికి వచ్చాడు. అతను రావటం చూసి జానకి పరుగెత్తుకుంటూవచ్చి 'ఒక మాట...' అంది.

'నీ మాటలకేంగాని....నేనొక శుభవార్త చెబుదామనుకుంటు న్నాను....' అన్నాడు.

'నేను చెప్పబోయేదిగూడా శుభవార్తే!' అంది జానకి.

'అయితే నువ్వే ముందరచెప్పు...'అన్నాడు రాఘవయ్య కొంచెం సర్దుకుని.

'మన పాదుకు వక పిందె పువ్వు పడింది.'

'ఆ...నిజంగా...లాంతరు తీసుకురా ... ఎక్కడా...ఏ తీగెకి ఉత్తరంవైపునా ... దక్షిణం వైపునా...' అంటూ గబగబ లాడిస్తూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

జానకి లాంతరు తెస్తూ "మీరు చెప్పబోయే శుభవార్త యేమిటి" అంది.

'అబ్బే...ఏంలేదు, తమాషాకన్నాను'

'కాదు, నిజం చెప్పండి'

'మనం పెంచుకొనడానికి దశరధ రామయ్య తన కొడుకునిస్తానని చెప్పాడు అదీ...' అన్నాడు.

జానకి లాంతరుకింద పెట్టి అతనికి దగ్గరగా వచ్చింది. ఆమెను హృదయానికి దగ్గరగా తీసుకుని 'రామయ్యగారితో ఏమని చెప్పను' అని అడిగాడు—

'మా దొడ్లో పాదుకు పిందెమొగ్గ వేసిందని చెప్పండి....' అంది జానకి—



# కాలిన చేతులు

ఆ రోజు ఆదివారం.

అయినా సూర్యోదయమయింది.

కాక ఏంచేస్తుంది ?

జస్టిస్ శేఖరంగారికి రాత్రంతా నిద్రపట్టలేదనీ, కలవరింతలతో బాధ పడుతున్నాడనీ దానికేం తెలుసు ?

కిటికీలోనుంచి వచ్చే వేడి కిరణాలు చురుక్కు మనిపిస్తున్నా శేఖరం కల కరిగి పోలేదు.

రైలు పట్టాలదాక వెంబడించిన వ్యక్తి ఇంకా తరుముతునే వున్నాడు. ఎవరినన్నా సహాయానికి పిలుద్దామని మనసులో అనిపించినా గొంతు పెగిలిందికాదు. మళ్ళీ మధ్య మధ్య జరుగుతున్నదీ కలా నిజమా? అని అనుమానంవచ్చి 'కలే' అయివుంటే బాగుంటుందనుకున్నాడు. ఆగంతకుడి ముఖం గుర్తుపట్టగలిగితే మర్నాడు పోలీసు రిపోర్టు ఇచ్చి ఆ మనిషికోసం వెతికించ వచ్చుననుకున్నాడు.

కల అయిపోవబోంది. కలలో మనిషి ఒక్కసారి ముఖం చూపించి మాయమయి పోయాడు. ముఖంమీద పెద్ద పుట్టుమచ్చ. గిరజాల జుట్టు....అతనే...సింగడు !

శేఖరం కల కరిగిపోయింది. ఉలిక్కిపడి లేచి కూర్చుని కళ్ళు నులుముకుని నాలుగు వైపులా కలియచూశాడు. సర్వరు వచ్చి 'అయ్యా.. కాఫీ తెచ్చానండీ....' అంటున్నాడు. కాఫీ ఆవిరిలోనుంచి సింగడు కన పడుతున్నాడు. శేఖరం కాఫీ కప్పును ఎడంచేత్తో ఫెడేలుమని కొట్టేసి 'యిది నాకు వద్దు తీసుకుపో....' అంటూ అరిచాడు.

జ్యూరీల సమ్మతిమీద సింగడిమీద నేరం ఆరోపించి మరణ శిక్ష విధించి సరిగ్గా వారం రోజులుగూడా కాలేదు. క్రిందటి రోజునే లెక్క ప్రకారం వురితీసి వుంటారు. శేఖరం గొణుక్కున్నాడు. సింగని రూపం కళ్ళల్లో మెదులుతోంది.

సింగడితో మొదటి పరిచయం శేఖరానికి మామిడితోటలో అయింది. చెట్టెక్కి పచ్చడికాయకి- బాగా నదురుగా వున్నవాటిని కోసి కింద బుట్టలోకి గిరవాటు వేస్తున్నాడు.

'ఎవర్రా వెంకయ్యా చెట్టెక్కింది?' శేఖరం అడిగాడు తోటమాలిని.

'మనోడేనయ్యా...ఆళ్లింటికాడ పనేమిలేదంటే...నాకింద జీతాని కుండరా అని తోలుకొచ్చాను...' సమాధానం చెప్పాడు వెంకయ్య.

శేఖరం చెట్టువైపుకు దృష్టి ప్రసరించాడు. ఎదురు తిరిగిన కండరాలు. ఉక్కు తీగెల్లాగా పైకి నల్లగా కనపడుతున్న నరాలు. గిరజాల జుట్టు, కళ్ళల్లో ఎర్రటి గీరలు. మంచి వస్తాదులా,, కనపడ్డాడు శేఖరానికి.

'మంచివాడేనా వెంకయ్యా....'

'మామడి సేనండీ....మా యింట చెడ్డ యిత్తనం యాడనుంచి వస్తుందండీ....'

శేఖరం నవ్వాడు. వెంకయ్య ఔనన్నట్లు తల ఊపాడు.

పాకలోనుంచి అప్పుడే వచ్చిందో పడుచు. వస్తూనే శేఖరాన్ని చూచి 'దండమండి...అయ్యగారూ...' అంది.

శేఖరం నమస్కారం స్వీకరించినట్లు ఒక చిరునవ్వు విసిరాడు.

'ఏమే సుబ్బి...నువ్విక్కడికి వచ్చి మూడేళ్ల కావటంలా...'

'కాకేం దొరా....'

'ఈ కాస్త కాలంలో మా తోట మూడు కాపులు కాసింది. నీ కడుపున గూడా వకకాయ కాస్తే మీ అమ్మా అయ్యా సంతోషిస్తారు గాదుటే....'

సుబ్బి సిగ్గుతో కుంచించుకు పోయింది. వెంకయ్య కొంచెం తికమక పడ్డాడు. సింగడు చెట్టుమీదనుంచి కిందకి దిగి వచ్చాడు.

'దేవుడి దయ కలగాలిగాని...మన చేతుల్లో ఏముందండీ?' సింగడు పెకిలిగా నవ్వాడు. వెంకయ్య కళ్లెర్ర చేశాడు.

'ఏమిటిరా అది...వెర్రివాగుడు నువ్వూను? మన అయ్యగారు.... దండం పెట్టు...'

సింగడు బిక్కముఖం పెట్టి నమస్కారం పెట్టాడు. శేఖరం మామూలుగా మళ్ళీ నవ్వాడు. సింగడు 'నా కెంతమంది అయ్యలురా' అన్నట్లు చూశాడు.

'మీవాడు గట్టివాడేనోయ్...' అన్నాడు శేఖరం.

సుబ్బి అక్కడినుంచి వెళ్లిపోయింది.

ఆరోజు రాత్రి వెంకయ్య సుబ్బిఉన్న గదిలోకి వస్తూ 'మన అదృష్టం అంత జోరుగా వున్నట్టులేదే' అన్నాడు.

'మన అదుష్టానికి వంకెవరు పెడతారు. నిక్షేపం లాగుంటే....'

'అదిగాదే...నువ్వీడకొచ్చి మూడేళ్ళయిందా ఇయ్యాల అయ్యగారు అన్నమాట గుర్తుకొచ్చేటప్పటికి....' నసిగాడు.

'దానికి నన్నేం చెయ్యమంటావు. దేవుడి దయ వుండాలిగాని..'

వెంకయ్య సుబ్బిని చేతుల్లోకి తీసుకుని 'మా సుబ్బి చాలా మంచిదే' అన్నాడు 'ఛో...!' విసుక్కుంది సుబ్బి.

అర్ధరాత్రి పన్నెండు గంటలయింది. సింగడు కాలుగాలిన పిల్లిలాగా తోట అంతా తిరుగాడుతున్నాడు. ఒకటి రెండు సార్లు పెద్దగేటు దాటి రోడ్డుమీదకు పోయి వచ్చాడు. ఎక్కడా జన సంచారమే లేదు. మళ్ళీ వేసవికాలం వచ్చేవరకూ ఈ మామిడి కాపు కాయదు గాబోలు! సంవత్సరానికొకసారి! అదీ బాగానే వుందనుకున్నాడు.

రోజు అంతా బయటనే పడుకునే వాళ్లు. ఈరోజు వెంకయ్య, సుబ్బి లోపలకు పోవటంతో సింగడికి మహా చీకాకుగా వుంది. మధ్య మధ్య గుడిసెలోనుంచి వస్తున్న మాటలు శూలాల్లాగా గుచ్చుకుంటున్నాయి. అప్పుడే తెల్లవారిపోతే బాగుండును అనుకున్నాడు సింగడు. అసలు తెల్లవారకుండా వుంటే బాగుంటుంది అనుకున్నాడు వెంకయ్య.

వీళ్ళ మాటలు లెక్క చెయ్యకుండా సూర్యోదయం అయ్యేముందు మామూలుగా తెల్లవారింది.

సింగడు కాయలు కోయటం, సుబ్బి బుట్టల్లో కెత్తటం, బుట్టలన్నీ దొంతర్లుగా తయారవుతున్నాయి. వెంకయ్య గేటు దగ్గర ముక్కాల పీట వేసుకుని డబ్బు పోగుచేస్తున్నాడు. వాడుక దార్లదగ్గరనుంచి. డబ్బు దగ్గర ఏదో పేచీ వచ్చి బిగ్గరగా మాట్లాడుతున్నాడు వెంకయ్య.

సింగడు సుబ్బి నెత్తిన ఆఖరి బుట్ట పెట్టుతూ 'నిన్న పొద్దున... మన అయ్యగారేమన్నారో గుర్తుందా?' అన్నాడు వెకిలిగా నవ్వుతూ. పట్టిన చెమటను తుడుచుకుంటున్నట్లు జబ్బలు చరుచుకున్నాడు. సుబ్బి వయ్యారంగా బుట్ట అందుకుని 'ఆఁ'....అంది.

ఆరోజు రాత్రి సుబ్బి, వెంకయ్య ఎందుకనో తగాదా పడ్డారు. సింగడు ఆరుబయట మంచంమీద పడుకుని ఈలపాట పాడుతున్నాడు. సుబ్బి విసురుగా తలుపు తీసుకుని బయటకు వచ్చింది. చాపచుట్టతో సహా. వెంకయ్య వెనుకగా వచ్చాడు, చాప చుట్ట తీసుకుని.

'ఈ లెక్కనయితే వక్క క్షణం వుండనంటోంది'సుబ్బి. వెంకయ్య నోరు మెదపకుండా కోరచూపులు చూస్తున్నాడు. సింగడు ఈలపాట పాడుతూనే వున్నాడు.

'వెధవ పాటా నువ్వూనూ....ఆపెయ్యరాదూ, విసుగు పుట్టు తుంటే...'

సింగడు పాట ఆపలేదు. 'నీ సొమ్ము ఏంపోయింది...ఆడు పాడుకుంటుంటే' అంది సుబ్బి. సింగడు శ్రుతిపెంచాడు. వెంకయ్య చాప చెఱుక్కున విదిలించి నేలమీద పరిచాడు.

మళ్ళీ తెల్లవారింది. చెట్టుమీదనుంచి కాయ దిగుతోంది. 'కాయ లన్నీ కోసేటంతవరకూ గంపల కెత్తవద్ద'ని సింగడు ముందుగానే ఆర్డరు జారీ చేశాడు. వెంకయ్య పోయి గేటు దగ్గర నిలబడ్డాడు, వర్తనదార్ల దగ్గరనుంచి పైకం వసూలు చేసుకోవటానికి.

కాయలన్నీ కావలసినవి కోయటం కాగానే చెట్టు దిగి వచ్చి 'గంపలన్నీ తీసుకురా' అన్నాడు.

సుబ్బి, సింగడు కలిసి కాయలన్నిటినీ గంపల కెత్తుతున్నారు. సింగడే ముందర పెదిమ కదిపాడు.

'ఏమిటే సుబ్బి...రాత్రి మీ ఆయనా నువ్వు గలాటా పడుతున్నారు.'

'నువ్వేరగందేముంది? మొక్కుకోమంటాడు పిల్లలకోసం. దేవుణ్ని మొక్కుకుంటే ఏమవుతుంది? అన్నాను....అదీ గలాటా' సింగడు మీసం మెలిపెట్టాడు.

'దద్దమ్మ అని ఆడదాన్ని డబాయిస్తాడూ దద్దమ్మ' సింగడు గొణిగాడు. సుబ్బి ఏమీ అనలేదు. మెదలకుండా బుట్ట నెత్తిన పెట్టుకుని బయలుదేరింది.

రోజూ కాయలన్నీ అమ్ముకు వచ్చేది. ఆ రోజు సగం కాయలు తట్టలో మిగిలి పోయినాయి. ఇంటికి రావటంగూడా బాగా ఆలస్యమయి పోయింది. చందమామ బాగా పైకెక్కాడు.

అప్పటిదాకా పెద్ద పులిలాగా గంతులువేస్తున్న వెంకయ్య సుబ్బి రాగానే చివాలున లేచాడు.

'ఎక్కడికి పోయావే యింతదాకా...సింగడెక్కడ చచ్చాడే...' సుబ్బి తట్ట నిలుపెత్తునుంచి కిందకి కూలవేసింది. కింద దొర్లిపోతున్న కాయలన్నీ వెంకయ్యను వెక్కిరిస్తున్నాయి.

'ఏమే మాట పెగలటంలా? సింగడేడీ...అంట.'

'సింగడూ...రంగడూ నాకేం తెలుసు! నా వెంటేసుకునిపోయానా.'

'ఇంత ఆలస్యం అయిందే, ఎక్కడెక్కడ తిరిగి వచ్చావేం!'

'కాయలేమన్నా అమ్ముడుపోతేనా...మాలపల్లిదాకా పోయి రావలసి వచ్చింది; అట్టా అయినా సగం తేలలా...'

మరి సింగడేడీ...'

'అదేమాట అడుగుతావు...నాకు తెలవదని చెప్పటంలా.'

వెంకయ్య గుడిసెలోకి చొరబడుతూ 'కూడు ఇయ్యాలేమన్నా వుడకేసి పెట్టే మాటేమన్నావుందా' అన్నాడు.

'లేకేం...నీకోసం కాకపోయినా నాకోసమయినా చేసికోవద్దూ అంది సుబ్బి.

సింగడు ఒక గంట తర్వాతగాని రాలేదు. వస్తూండగానే అడిగాడు వెంకయ్య 'ఎక్కడినుంచిరా రావటం' అని.

'కొంచెం ఆలస్యమయిందిలే...!'

'అందుకనేగా అడగటం...'

'మా సేయితుడు వచ్చాడులే! మా వూరు కాచనుంచి...'

ఆ రాత్రి...అంతా ఆమదయతే పడుకున్నారు. ఒక రాత్రివేళ వెంకయ్యకు మెలుకువ వచ్చింది. సుబ్బి చాపమీద లేదు. సింగడు మంచంమీద కనపడలేదు. కంగారు పడుతూ లేవబోయేసరికి ఎదురుగుండా ఉన్న మామిడిచెట్టు కొమ్మమీద నుంచి కొరివిదయ్యంలా ఒకటి వేళ్ళాడుతున్నట్లు కనిపించింది. ముసుగు తలనిండా పెట్టుకుని ఆంజనేయ దండకం పఠనం చేసి నిద్రపోయాడు.

తెల్లవారగానే మామిడిచెట్టు కొమ్మమీదనుంచి వేళ్లాడుతున్న తెల్లచీరె కనపడింది.

'ఆ చీరె అక్కడ తగలేశావెందుకు...రాత్రి చాలా భయం వేసింది...!' కంగారు వెళ్ళబుచ్చాడు వెంకయ్య...వస్తున్న నవ్వు ఆపుకుంది సుబ్బి. సింగడు పైకి పకపకా నవ్వేశాడు.

'చీరెల్ని చూస్తేనే ఇంత భయం అయితే మనుష్యుల్ని చూస్తే ఇంకేమన్నా వుందా.'

'తెలివితేటలు మరీ ఎక్కువయినట్లున్నాయే...'

'మామిడికాయలు బాగా వంటబట్టినాయి...'

సుబ్బి ఈసారి మళ్ళీ నవ్వు ఆపుకోలేక పోయింది. వెంకయ్య రుసరుసలాడుతూ 'మళ్ళీ బేరగాళ్లు వస్తారు...తొందరగా చెట్టెక్కు...' అన్నాడు.

రోజులన్నీ కలిసి మూడు నెలలు అయిపోయినాయి. వెంకయ్య బాగా మారిపోయాడు. అయినదానికి కానిదానికి చీకాకు బాగా ఎక్కువయింది. సింగడు అంటే అసహ్యం, అసూయ బాగా పెరిగిపోయినాయి. అతడు యింట్లోనుంచి తెల్లవారగానే ఎంత తొందరగా బయటికి వెళ్లిపోతే అంత సుఖంగా వుంటుంది, వెంకయ్యకు. సుబ్బిని

యింట్లోనే వుండి బొమ్మని చెప్పటానికి ధైర్యంచాలటం లేదు. అతికి పోయే అబద్ధంకోసం చాలాకాలం ఆలోచించి ఏమీతోచక ఊరుకున్నాడు.

మామిడికాపు అంతా అయిపోయింది. ఆచారంకోసం అట్టే పెట్టిన కాయలు మూడింటిలోనూ పెద్దకాయను చిలక కొట్టేసింది. సింగడు చెట్టుకింద కొత్తగుడ్డ పీలికలు చిన్న పోగుచేసి కూర్చున్నాడు. చేతిలో సూదీ, దారం ఆడిపోతోంది. వెదురుపుల్లలు బాణంలాగా వంచినవి మానుకు ఆనించి పెట్టాడు:

'ఏమిటిరా ఈసరంజామా...అంతా'?

'రథం కటుతున్నాను ...బాగుందికదూ!'

'ఇంకా కట్టలేదుగదా...కట్టిన తర్వాత బాగానే ఉండచ్చులే... చిన్న పిల్లాడిలాగా ఏమిటా పనులు...ఇంకేదన్నా పని చూసుకోరాదూ...'

'చూసుకుంటానులే...ఈ పని పూర్తికానీ...ఇదయినా నాకోసం కాదులే...నీకు పుట్టబోయే పిల్లాడికోసం...'

'నాకా......? పెద్ద ఆఘాతం తగిలింది వెంకయ్యకు. సింగడి చేతిలో కాగితాన్ని, గుడ్డపేలికల్ని తీసుకుని చిందరవందరగా విసిరి పారేశాడు గావు కేకలు పెడుతూ.

సుబ్బి వచ్చింది—అప్పుడే తట్ట నెత్తినపెట్టుకుని.

'ఇటురా...సుబ్బీ...' జుట్టుపట్టుకుని గబగబా గుడిసెలోకి లాక్కుపోయాడు. ఈహఠాత్పరిణామానికి చాలా కంగారు పడిపోయింది సుబ్బి.

'నిజమేనా...చెప్పు...నిజంచెప్పు...'

'ఏ సంగతి చెప్పకుండానేనా...'

'ఆ మాట నా నోటినుంచి వస్తేనేగాని సారస్యం పూర్తికాదా...'

'సరీ బాగుందే అసలు గొడవ ఏమిటో చెప్పకుండానేనా....'

'చెప్పాలే...చెప్పాలేంనీకు.... సింగడికి నీ సంగతి తెలిసిందిగాని నీ సంగతే నీకు తెలియటంలా.'

సుబ్బి మనస్సుకు అర్థమయింది వెంకయ్య ఆవేదనంతా. పూల పంకెనున్న చీరె తీసి మడతలు పెటుతూ 'నీకూ తెలిసిందిగా మళ్ళీ నేను చెప్పేదేముంది?

వెంకయ్య కళ్ళు ఎర్రబారినాయి. దుఃఖం వచ్చినంత పనయింది. కనుకొలకులలో నిండిన నీటి బిందువుల్ని కింద పడకుండా పై గుడ్డతో అద్దుకుని 'షో అవతలికి...నా కంటికి కనపడక...' బిగ్గరగానే అని చాడు. సుబ్బి మాట్లాడకుండా వెళ్ళిపోయింది.

సింగడు వాకిట్లోనే ఎదురు పడ్డాడు.

సుబ్బీ యిట్లారా...'

'ఏం...'

'వెంకయ్య ఏంటి గదమాయిస్తున్నాడు...'

'ఏముంది...మామూలేగా...'

'యియ్యాల్నించి నిన్ను పల్లెత్తు మాట అనటానికి వీల్లేదు...ఎరు గున్న మడిసిగందా అని వూరుకుంటే...యవారం మాయిదిగా వుందే...'

'వూరుకో...వింటాడు...'

'ఏం వింటే మాలావు...ఏదో వకటి తేలిపోవాలి...'

'ఏమిటిరా తేలిపోయేది...కూటికిలేని వాడివిగదా అని యీడకి తెచ్చినందుకు. కొమ్ములు మొలిచాయే...'

'ఏం మొలవక....మొలిచే రోజులొచ్చాక నువ్వాగమంటే ఆగు తాయా...'

'అయ్....దొక్క చీరేస్తాను....' చెంప ఛెళ్ళుమని మోగింది. అప్పటిదాకా చేతిలోవున్న వెదురుబద్దని మామిడి మాను వైపుకు గిరవాటు వేసి కలబడ్డాడు సింగడు. వెంకయ్య తలపాగా తీసి నడుముకు చుట్టాడు. ఎరమీదికి దూకిన పెద్దపులిలాగా సింగడు మీదపడి బాదుతున్నాడు. సింగడి ఓర్పు చచ్చిపోయింది. వెంకయ్యను బలవంతంగా వక్కతన్ను తన్ని బలంగా గుండెల్లో గుద్దాడు.

కుస్తీ పందెమని ముందరగా కబురు చేసేటట్లయితే చాలామంది వచ్చి ఆనందించే హాళ్ళేగాని యిప్పుడు వక్క సుబ్బి మాత్రం చూస్తోంది. ఆమె మనసు రాలిపోయిన ఎండు మామిడాకులా రెపరెప లాడుతోంది. వారిద్దరిలో ఎవరు ఓడిపోయినా తన ఓటమిగానే అవుతుంది సుబ్బికి.

వీధిలో రెండు కుక్కలు పోట్లాడుకుంటుంటే అదురుగుండెతో నిలబడి చూస్తున్న మూడోకుక్కలా వుంది సుబ్బి పరిస్థితి.

సుబ్బి వాళ్లిద్దరి మధ్యకుపోయి విడదీయటానికి ప్రయత్నించింది. వెంకయ్య కొంచెంగా తగ్గటానికి ప్రయత్నంచేశాడు. సింగడు ఆవేశంలో తలమీద మోపైన దెబ్బ కొట్టాడు. వెంకయ్య 'అమ్మో' అంటూ అరుస్తూ నేలమీదికి వరిగాడు.

సుబ్బి శేఖరం గారింటికిపోయి చెప్పింది జరిగినసంగతి. ఇంటి పక్కనే వున్న డాక్టరును వెంటపెట్టుకుని వచ్చాడు శేఖరం.

వెంకయ్య స్పృహ లేకుండా పడివున్నాడు. డాక్టరు వెంటనే ఏదో ఇంజెక్షను యిచ్చాడు. సుబ్బి తాటాకు విసిని కర్రతో విసురుతునేవుంది. తన చేతి దెబ్బతిని తన్నుకుంటున్న పామును చూస్తున్నట్లుంది సింగడికి.

వెంకయ్యకు ప్రాణంవచ్చింది. తెలివి రావటంతోనే 'నిన్నేం చేస్తానోచూడు' అంటూ పైకిలేచాడు. డాక్టరు అదిమిపెట్టి విశ్రాంతి చాలా అవసరమని చెప్పాడు.

శేఖరం 'సింగడిని పోలీసులకు అప్పచెప్తతా' నన్నాడు. సుబ్బి వద్దంది-సింగడు మీసాలు మెలిపెటుతూ చెట్టుమాను అనుకుని నిలబడ్డాడు.

వెంకయ్య బాగా కోలుకునేటప్పటికి బాగానే పొద్దు ఎక్కింది. ముభావంగా లేచి గుడిసెలోకిపోయి అన్నం తిన్నాడు. రోజూ సింగడిని అన్నం తినేటప్పుడు పిలిచే అలవాటు. ఈ రోజు సింగడు తనంతటతనే వచ్చాడు. వాడికి అన్నం పెట్టటానికి వీల్లేదన్నాడు వెంకయ్య. 'నీ సొమ్మేం పెట్టటం లేదుగా' అన్నాడు సింగడు. మళ్ళీతగాదా పెరుగుతుందేమో నని భయపడింది సుబ్బి. ఎందుకనో సర్దుకుపోయింది. వెంకయ్య పొద్దున తిన్న దెబ్బలు మరిచపోక పోవటం వలననే తగాదా అణిగిపోయి వుండాలి.

బాగా చీకటీపడేవరకు వెంకయ్య యిల్లంతా తిరుగుతునే వున్నాడు. సుబ్బి తప్పించుకు తిరుగుతోంది. సింగడు బజారుకు పోయాడు.

'వాడిచేత కొట్టిస్తావుటే నన్ను....ఆ... వెంకయ్య సుబ్బి జుట్టు పట్టుకుని పక్కా అరుపు అరిచాడు. సుబ్బి నిర్ఘాంతపోయింది.

అందని లోతులలోనుంచి చెలరేగే మానసికమైన వేదన ఎవ్వరూ ఇంతవరకూ జ్యోతిషం చెప్పలేని అనేక విషయాల్లో వకటిగా వుండిపోయింది. అణిగి పోయిందనుకున్న అగ్ని మళ్ళీ చెలరేగటానికి కావాలసిన వాతావరణం చాలా ప్రధానమయిన విషయం అనిపిస్తుంది. సుబ్బి ఆశ్చర్య పడటంలో వింత కలిగించే విషయం ఏమీలేదు.

వెంకయ్య చేతికొచ్చినట్లల్లా బాదుతున్నాడు. సుబ్బి రోదిస్తోంది. తనకేమీ తెలియదంటుంది.

'పొద్దున్నే పెళ్ళి చెప్పింది నువ్వేగామా...'

'........'

'యిదిగో ఆఖరిసారి నీతో చెప్పేస్తున్నాను...నాతో వుంటావా చచ్చినట్టు యిక్కడపడివుండు—లేదంటావా సింగడు నువ్వు కలిసి ఏ గంగలోనన్నా దిగండి—'

'గంగలు అక్కర్లేదు....కిష్టలూ అక్కర్లేదు...'సుబ్బి నీరసంగా గొణిగింది.

'సిగ్గులేదూ...యింకా మాట్లాడుతున్నావు...

'మీకు లేనిది...నా కెందుకు...'

'ఆ...సింగడితో నీకేంటే సంబంధం... కట్టుకున్న మొగుణ్ణి నే వున్నాక...'

'ఆ....వున్నారు...మూడేళ్ళయింది...కట్టుకుని...'

'మూడేళ్ళయితే ఏం....ముప్పై ఏళ్ళయితే...'

'నా కంత ఓపికలేదు...దేవుడికి మొక్కుకోటాలూ అవీ నాకు చేతకావు...నాకు దేవుడికంటే మనుషులమీదే నమ్మకం ఎక్కువుంది...'

'నన్ను కాదనటం కాకుండా దేవుణ్ణికూడా కాదంటావుటే... ఆ...' రొప్పుతున్నాడు వెంకయ్య.

'ఎందుకు ఇంత గందరగోళం...కట్టుకున్నవాడిని నిన్నొదిలి ఎక్కడికి పోతాను.... పిల్లడిమీద మోజు కలిగిందిగాని, సింగడేం నాకు ఎక్కువకాదు...నువ్వు తక్కువాకాదు...'

వెంకయ్య ఆవేశం పరాకాష్ఠకెక్కింది. తన వ్యక్తిత్వాన్ని కట్టుకున్న ఆడది నిలువునా కాల్చేస్తుంటే వళ్లుమండిపోక ఏం చేస్తుంది? అతనికి కిందూ మీదు తెలియలేదు. పక్కనేవున్న పచ్చడిబండ తీసుకుని సుబ్బితలమీద బలంగా మోదాడు. సుబ్బి నేలకూలిపోయింది.

వెంకయ్య గబగబా శేఖరంఇంటికి పరిగెత్తాడు. శేఖరంఅప్పుడే ఆరుబయట వాలుకుర్చీలో పడుకుని పేపరు చదువుకుంటున్నాడు.

'బాబుగారు కొంప మునిగిపోయిందండి....'

'ఆ.... ఏమయిందిరా....'

'సుబ్బిని చంపేశాడండి...ఆసింగడు'

'ఆ...ఎక్కడున్నాడు...ఎక్కడ'

'పారిపోయాడండి ... పట్టుకుందామంటే అందలేదు మీకోసం పరుగెత్తుకుంటూ వచ్చాను...'

కట్టుకున్నలుంగీతోనే పైబట్టన్నా లేకుండా శేఖరం పరిగెత్తాడు వెంకయ్యవెంట. సుబ్బి స్పృహలేకుండా పడిపోయివుంది.

'పొద్దున నన్నే చంపటానికి ప్రయత్నంచేశాడు.' వెంకయ్య మాట్లాడేస్తున్నాడు. ఆతని నాలుక మధ్య మధ్య ఎదురుతిరుగుతోంది. పెదిమలు తడబడుతున్నాయి.

శేఖరం మనుష్యుల్ని పంపించాడు సింగడిని వెదికిపట్టుకురమ్మని. సింగడికి ఈ సంగతి తెలియగానే అడ్డదారిన పరుగెత్తుకుంటూ వచ్చాడు. వెదకటానికి పోయినవాళ్లు తరువాత అరగంటకిగాని తిరిగి రాలేదు.

తలపగిలి పడివున్న సుబ్బిని చూచేటప్పటికి సింగడి గుండె పగిలిపోయింది. గుడిసెలోపలికి వస్తూనే 'సుబ్బీ...'అంటూ బిగ్గరగా ఏడుస్తూ ఆమెమీద విరుచుకుపడి పోయాడు.

వెంకయ్య 'అడుగోనండి...'అంటూ అరిచాడు. శేఖరం విస్తుపోయాడు.

ఆఖరిసారిగా సింగడిని చూడగలిగినందుకు సుబ్బిముఖంలో అతి పేలవమైన సంతృప్తిరేఖ గోచరించి వెంటనే అదృశ్యమయింది. ముఖం నల్లబడిపోయింది. వెంకయ్య అదేపనిగా ఏడుస్తున్నాడు.

సింగడు నల్లబారిన ముఖం చూడలేక వాకిట్లోకివచ్చి నిలబడ్డాడు.

'ఎక్కడికి పోతున్నావు...ఆగు...' శేఖరం గద్దించాడు.

'నాసుబ్బినొదిలి నేనెక్కడికిపోతాను' గద్గదమైంది సింగడిగొంతు.

'వీడిని తీసికెళ్ళి పోలీసుస్టేషనులో అప్పగించి యిక్కడికి సర్కిలు యిన్స్పెక్టరుని వెంటనే పిలుచుకురండి...' అక్కడే నిలబడి చూస్తున్న ఇద్దరు బంట్రోతులను పురమాయించాడు.

సర్కిలు రావటానికి ఎక్కువసేపెం పట్టలేదు. సింగడు సర్కిలు వచ్చేటంతవరకు ఎవరెంత బలవంతంచేసినా కదలలేదు. మామిడిచెట్టు మూనక్రిందిగుడ్డపేలికలన్నీ సర్దుతూ అక్కడే చతికిలబడి కూర్చున్నాడు.

'ఎవరు హత్యచేసింది ...ఎవరు .... ఎక్కడ ...' గుడిసెలోకి వస్తూనే కంగారుగా అడిగాడు సర్కిలు.

సింగడు చేతిలోవున్న గుడ్డపేలికల్ని గిరవాటువేసి 'నే నేనండి సుబ్బినిచంపింది' అన్నాడు.

వెంకయ్యఏడుపుఅర్ధాత్తుగాఆపి అతివిస్మయంతో లేచినుంచున్నాడు. సింగడు వెంకయ్య దగ్గరకువచ్చి నిలబడ్డాడు. శేఖరం అందుకుని 'ఇతనే నటండీ తలమీదకొట్టి పారిపోయాడు....మళ్లీ మనుష్యులుపోయి పట్టుక వస్తే వచ్చాడు....' సింగడివైపు చూపించాడు.

'చేతులకు బేడీలువేయండి.....' ఆర్డరు జారీచేశాడు సర్కిలు. వెంకయ్య కొయ్యబారిపోయిచూస్తూ నిలబడిపోయాడు.

'సుబ్బిని పాపని పంపిందికాక ... అదేలోకానికి నన్ను గూడా పంపించబోతున్నందుకు .... నీకెంతో రుణంవుంటుంది వెంకయ్య ...' అన్నాడు సింగడు తనకు ఉరిశిక్ష ఖాయమని నిర్ధారణచేసుకుని.

అనుకోని అనుభూతులు అనేకంవస్తూంటే పరిస్థితుల ప్రాబల్యానికి తలవగ్గి ఆఖరికి దాని యినుప పళ్ళమధ్యనే నలిగిపోతుంటాయిజీవితాలు. అందులో సింగడి జీవితం చేరిపోక ప్రత్యేకించి వుండేటంత మనోదార్ఢ్యంలేదు. ప్రాణంలాగా చూసుకునే సుబ్బి, తన వునికికి ఛాయలాంటి పుట్టబోయే పసిపాప తననివిడిచిపోయాక ఇంకెవరికోసం

ఈ లోకంలో నిరర్థక జీవితం గడపాలి. వెంకయ్య సమయస్ఫూర్తికి మెచ్చుకున్నాడు సింగడు.

సుబ్బిని ఆసుపత్రికి తీసుకొనిపోయి శవపరీక్షచేయాలన్నారు. హత్యకు అంగీకరించిన తర్వాతగూడా సుబ్బి శరీరాన్ని చిత్రవధచేస్తేనే గాని తనుచేసిన పాపాలకు పరిపక్వం కలగదేమో? సింగడు ఆలోచిస్తూ పోలీసుల వెనక నడచి వెళ్లుతున్నాడు. వెంకయ్య గేటుదాకావచ్చాడు.

'ఇప్పటికీ నీకంటే నేనే అదృష్టవంతుడినిలే' అన్నాడు సింగడు ఎండిపోయిన పెదవులమీద వికృతమందహాసం వెదజల్లుతూ.

'అంతా నన్ను విడిచిపోతున్నారు ... నేనేంచెయ్యను' గొణుగుకున్నాడు వెంకయ్య. పిరికిగుండెలోపల దడ దడ లాడింది.

హంతకుడే నేరంఒప్పుకున్న తర్వాత కోర్టులో జూరీలపని చాలా వరకు తగ్గిపోయింది. కోర్టులో వెంకయ్య సాక్ష్యంచెప్పాడు. సింగడు పచ్చడిబండతో బాదుతుంటే తనుచూసినట్లూ ... వారించపోతే తనను విదిలించి పారిపోయినట్లూ...తను భయపడి శేఖరంగారి దగ్గరకుపోయి జరిగిన సంగతి విన్నవించినట్లూ...' సింగడు పకపకనవ్వాడు కోర్టుహాలు దద్దరిల్లేటట్లు. 'ఆర్డర్....ఆర్డర్....' అంటూ అరుపులు వినవచ్చాయి. ఎవరినైనా భయంకరమైన చూపులు హడలగొటతాయిగాని, ఆవికృతమైన నవ్వే వెంకయ్యను బేజారుచేసింది. భయపడుతూ కిందకు పారిపోయి వకమూలగా కూర్చున్నాడు.

కోర్టు తీర్పుఇచ్చేసింది. సింగడిని శనివారం ఉరితీసెయ్యాలి. జస్టిస్ శేఖరం మనసు చాలా ఆందోళనగావుంది. సాక్ష్యాలతో సరిపోని లోకంలోనుంచి అతనికిమాటలు వినబడుతున్నాయి 'సింగడు హంతకుడు కాడవి...' సాక్ష్యం బలంగావుంది. శేఖరం తీర్పుచెప్పేసి చేతిలోవున్న కాగితాలను బలంగా బల్లమీదకొట్టి కిందకుదిగిపోయాడు.

కోర్టువారు సింగడిని చెప్పేదేమన్నా వుందా అంటే చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు. వెంకయ్య సాక్ష్యంచెపుతుంటే పకపకానవ్వాడు.

పోలీసులు అతన్ని కిందకు తీసుకుపోతుంటే కారులో ఎక్కుతున్న శేఖరాన్నిచూసి 'మీమేలు మరవలేనండి....' అంటూ నమస్కారం

చేశాడు. శేఖరం తలుపు వేడేలుమని వేసుకుని 'ఇంటికిపద' అన్నాడు డ్రైవరుతో........

* * * * *

శేఖరం బరువుగా కిటికీలోనుంచి తన మామిడితోటవైపు చూస్తున్నాడు. వెనకవైపునుంచి బంట్రోతువచ్చి 'మిమ్మల్ని చూడటానికి వెంకయ్య వచ్చాడండి' అన్నాడు.

'ఇంతపొద్దున్నే ఏంపనివచ్చిందిరా సాయంత్రంవచ్చి మాట్లాడమను....'

'ఇప్పుడే చూడాలంటున్నాడండీ...'

'వీల్లేదని చెప్పు...'

వెంకయ్య బంట్రోతును తోసుకుంటూ గదిలోపలకివచ్చివచ్చాడు.

'బాబూ...అన్యాయం జరిగిపోయిందండి...'

'ఏంటిరా....మళ్ళీ ఏం వచ్చింది....'

'సింగడిని అన్యాయంగా చంపారండి...'

'ఎవరూ...నేనా....నీమతిపోయిందేమిటి...ఫ్యాన్ వీడిని బయటకు గెంటెయ్యి....'

'నాపనికావటంతోనే నేనేపోతాను. సుబ్బిని చంపింది సింగడు కాదు ... నేనే ... నేనే చంపాను ... కడుపు ఉడికిపోతే తొందరపాటులో తెలియక బండపెట్టి కొట్టాను...ఇంత ప్రమాదంగా తగులుతుందని అనుకోలేదు అయ్యగారూ...' పసిపిల్లవాడిలా ఏడుస్తున్నాడు. శేఖరం మతి భ్రమించినవాడిలా వక్కసారి మంచంమీదనుంచిలేచి మళ్లీ కూర్చున్నాడు.

'నేను ఆవేశంలో సుబ్బిని చంపితే...నిజం తెలుసుకోలేకుండా బూటకపు సాక్ష్యంమీద బాగాఆలోచించి మాసింగడిని మీరు చంపారు... నా సింగడిని నాకివ్వండి....నాకివ్వండి...' శేఖరం పాదాలు పట్టుకుని తలబాదుతున్నాడు వెంకయ్య. విదుల్చుకుంటున్నాడు శేఖరం.

'పూరికే అరిచావంటే....'గదమాయించాడు శేఖరం.

'నా సింగడిని నాకప్పచెప్పండి....లేకపోతే నేనూ వాడిదగ్గరకే పోతాను...మీతోటపని నాకక్కరలేదు...'

వెంకయ్యని వదిలిపెటితే ఆత్మహత్య చేసుకుంటాడేమోనని భయంవేసింది శేఖరానికి. వదిలిపెట్టక ఏంచెయ్యాలో తోచలేదు. పిరికి గుండెతో మామిడిచెట్టువైపు చూచాడు. పెద్దమామిడిచెట్టు సింగడి అస్థిపంజరంలాగా కనపడుతోంది.

శేఖరం వెంకయ్యచేతులను తనచేతుల్లోకి తీసుకొని 'యిద్దరమూ హంతకులమే అయ్యాం.... ఇప్పుడేంచేద్దాం వెంకయ్యా....' అని ఘోరమని ఏడ్చాడు. వెంకయ్య అతని చేతులు విదిలించి కాళ్ళుపట్టుకొని

'మీరేంచెపితే అదిచేస్తాను బాబూ' అన్నాడు.

'నా తోటవిడిచి, నన్ను విడిచి వెళ్ళిపోక...నువ్వు లేందే నేను బతకలేను' అన్నాడు శేఖరం కుప్పగా కూలిపోతూ.



# ధర్మపత్ని

"ఎవరే యింట్లో..." తలుపు పగిలిపోయేటంత గట్టిగా దబదబా బాదుతూ శివరావు పొలికేకపెట్టాడు.

"వస్తున్నానండీ .."వణికి పోతున్న కంఠ ధ్వని యింటిలోనుంచి వచ్చింది.

"ఎవరండీ యింట్లో" శివరావుతోబాటుగా వచ్చిన శశి గోముగా అడిగింది. శశివైపు తిరిగి సూటిగా మాటలాడటానికి సంశయించాడు అతను. నోరు తెరిస్తే దొంగసారాయి వాసన గప్పుమని పైకివచ్చే టట్లుంది. తలుపును ఇంకా దబదబా బాదుతూ "పనిమనిషి శశీ ..." అన్నాడు.

శశి అంతకి మించి వేరే ప్రశ్నించదలుచుకోలేదు. అయినా ఆరోజు యిల్లూ వాకిలీ చూసిపోదామని వచ్చిందిగాని, యింట్లో పనిమనిషితో పరిచయం చేసుకుందామనికాదు. నిర్లక్ష్యంగా తెరపని తలుపు వంక చూసింది. శివరావు తలుపుగొళ్లెం చప్పుడుచేస్తూనే వున్నాడు.

"పాలు పొంగిపోతుంటే దింపేటప్పటికి ఆలస్యమయిందండి" తలుపుతీస్తూనే సుమతి తడబడలాడుతూ గొణిగింది.

"కొంపకొచ్చేటప్పటికి నువ్వు నవ్వుతూ ఏడ్చింది ఒక్కరోజు తగలడింది కనక...ఎప్పుడూ దరిద్రపు ముఖమూ నువ్వూనూ..."శివరావు తెరుచుకుంటున్న తలుపును దభేలుమని లోపలకు తోసుకొనివెళ్ళాడు. శశి సుమతి ముఖారవిందాన్ని పరీక్షిస్తూ వయ్యారంగా గదిలోకి అడుగు పెట్టింది.

సుమతి తెల్లబోయింది శశిని చూడగానే. తనింటిదగ్గర చూడటం ఇదే మొదటిసారయినా అదివరకు అనేకసార్లు పెద్దబజార్లోనూ, కూరల మార్కెట్టుదగ్గర చూసింది. ఇప్పుడు పోల్చుకునే స్థితిలోలేదు.

మెల్లిగా అడుగులువేసుకుంటూ వంటింట్లోకిపోయి వేడినీళ్ళచెంబు తీసుకునివచ్చి వాకిట్లో అరుగుమీదపెట్టింది. దండెంమీద ఆరవేసిన తువ్వాలు మాగవెన్నెలలో తెల్లగా కనపడుతోంది.

"కాళ్ళు కడుక్కోండి....అన్నం పెడ్తిస్తాను...." సుమతి మెల్లిగా గదిలోకివస్తూ అడిగింది.శివరావు గుడ్లురిమాడు వాకిట్లోకి గబగబావస్తూ.

సుమతి అతని వెంటనే నడిచింది. చేతులమీదా నీళ్ళుపోస్తూ అతి మెల్లగా 'ఆమె ఎవరండీ' అంది.

'కళ్ళు కనపడటంలా' అంటూ గదమాయిద్దామనుకుంది గాని, శశి ఎందుకనో చాలా మందహాసంతో సమాధానం చెప్పేసింది శివరావు నోటివెంట మాటరాక మునుపే 'కాబోయే అమ్మగారినని'.ఆమాటఅంటూ శశి సిగ్గు అభినయించింది కూడా.

'ఆ' అంటూ చెంబువదిలేసింది సుమతి. కాలిమీద వీళ్ళతో చెంబు పడగానే శివరావుకు గంగవెర్రు లెత్తినట్లయింది.

'ఫో.... పాడుముండా అని...,నేను యింటికివచ్చేటప్పటికి మీ వాళ్ళింటికిపోయి కూలబడిమని చెప్పానా....నువ్వు చెప్పగానే ఎందుకు వింటావు....' కిందపడి పోయిన చెంబు తీసి బలంగా కొట్టాడు సుమతి వీపుమీద. నెప్పిని లోపల దిగమింగుతూ గబగబా వాకిలివైపు అడుగులు వేసిందిసుమతి.

'ఇంత పొగరుమోతు పనిమనిషిని ఎలావుంచుకున్నారండి మార్చి పారెయ్యక... ఈ అలికి జనాన్ని నగం మాడ్చివుంచాలిగాని' శశి విసుగ్గా బయటకువచ్చి పమిట విదుల్చుకుంటూ లోపలకు పోయింది.

'నన్నెక్కడకు పొమ్మంటారు మిమ్మల్ని విడిచి' అంటూ సుమతి నోటిలోనుంచి అతి నీరసంగా వచ్చినమాటలు గదిగుమ్మందాకానేరాలేదు. శివరావు తలుపు గడియవేసి గొణుక్కుంటూ లోపలకుపోయాడు.

సుమతి నడుంపట్టుకుని బలవంతంగా అరుగుమీదకు చేరింది. పరుళ్ళమీద ఆధారపడాల్సిన జీవితాలు అంతేగదా అనుకుంది. గడిచిన జీవితపు గాథలు భయంకరంగా కనురెప్పలోపల కనపడుతున్నాయి.

పెళ్ళిరోజు.... తనకిష్టంలేకపోయినా అయిన సంబంధం అని తన్ని పోషిస్తున్న తనబంధువే తన కొడుకుతో ముడిపెట్టడానికి ఖాయం చేశాడు. "పెద్దలచే నిశ్చయింపబడినదిగాన" అంటూ శుభలేఖలోవున్న అక్షరాలు చదువుతుంటే 'తనకిష్టంలేని పెళ్ళిని ఈపెద్దలు నిశ్చయించ

టానికి ఏం అధికారంపుంది?" అంటూ ప్రశ్నించుకుని ఎవరినీ అడగ టానికి ధైర్యం చాలక కుళ్ళి కుళ్ళి ఏడ్చింది. అప్పుడే ధైర్యం చేసినా తనజీవితం సవ్యంగా సాగిపోయేదేమో?

మంగళసూత్రం కట్టడానికి వస్తున్నప్పుడు కళ్ళనీళ్ళ పర్యంతం అయింది.... "ఈతాగుబోతు తన మెడకు పురితాడు బిగిస్తున్నాడే" అనే చింత మనోవ్యాకులతతో, చనిపోయిన తల్లి బ్రతికుండగా చెప్పిన మాటలు జ్ఞప్తికివచ్చినాయి "శుభకార్యం జరుగుతున్నప్పుడు కంటనీరు పెట్టగూడదని." ఇది శుభకార్యం అవునాకాదా అని మనసులో సంశ యంగానే వుంది.

ఈనాడు....?ఆనాడు వూహించిన భీభత్స దృశ్యాలన్నీ ఒక్కొ క్కటీ దాపురిస్తున్నాయి. మనసిచ్చి మాటాడకపోయినా తన జీవితంలో సుఖవంతంగా గడపిన దినం వక్కటిగూడా లేదనే చెప్పాలి వివాహం అయిన తర్వాత.

సుమతి ఆలాపనగా అరుగుమీదవున్న స్తంభానికి చేరగిలబడి వేసి వున్న తలుపువైపు చూస్తోంది. తలుపు సందుల్లోనుంచి దీపం వెలగటం ఆరిపోవటం అనేకసార్లు జరగటం చూసింది.మనసులో ఉవ్వెత్తుగాపొర్లు కొస్తున్న దుఃఖం కంటివెంబడి వూరికే కారిపోతుంది.

"మీ పనిమనిషిని మార్చివేయండి... తలతిరుగుడు మనిషిలాగా వుంది..." శశి అంటున్న మాటలు అస్పష్టంగా వినబడగానే "నేను పని మనిషినిగాను" అంటూ బిగ్గరగా అరుద్దామనుకుంది. అదీ తన వునికికే హానికలిగించవచ్చుననే భయం కొద్దీ నోరు నొక్కుకుని వూరుకుంది.

"ఏమండీ....మాట్లాడరేం..."

"ఏంకావాలి శశీ......"

"హృదయం ఇచ్చి వివాహం చేసుకుంటానన్నారు...అంతకంటే ఏంకావాలి..."

"అది సరే శశీ .... ఏదో అడుగుదామనుకుంటూ మానేశావు యిప్పుడు ..."

"అటూ యిటూ మీకూ నాకూ గూడా ఎవరూ లేనప్పుడు...మనం యిక్కడ టూకీగా వివాహం అంటూ ఏర్పాటుచేసి..."

"డప్పు కొట్టుకుంటేనేగాని పెళ్ళి అయినట్లుగాదా ... ఏమిటి నీవెర్రిగాని... పెళ్ళి అంటే నలుగురూ నాలుగు అర్థాలు తీస్తారు...అది గాకపోయినా శాస్త్రయుక్తంగా చేసుకుంటే పెళ్ళిగాని దండలువేసుకుంటే పెళ్ళి కానట్లా!"

"పోనీ అట్లాగే చేద్దాం... నా జీతంలో మిగిల్చినడబ్బు కొద్దిగా, ఓరిచ్చిన డబ్బు బోలెడెంతావుందిగా..."

"మొత్తానికి నీచాదస్తం పోలేదన్నమాట"

"పోండీ..."

సుమతి బయటి వరండాలో అరుగుమీద కళ్ళు, చెవులూ మూసుకుని వినకూడదనుకుంటూనే సంభాషణఅంతా వింది.కాసేపు వరండాలో అటూ ఇటూ తిరిగింది. రోడ్డుమీద జనసంచారం ఏమీ లేకపోవటం వలన కొద్దిగా ధైర్యంచేసి రోడ్డు చివరదాకా పోయివచ్చింది. నిద్ర ఒస్తూవస్తోంది. అరుగుమీద అటు ఇటూ కాసేపు దొర్లి కలవరిస్తూ నిద్రపోయింది.

పక్కవాళ్ళింట్లో బుట్టకిందనుంచి కోడి కొక్కొరొకో అంటూ బిగ్గరగా అరిచింది. దానికీ అప్పుడే ఎందుకనో మెళకువ వచ్చినట్టుంది. అప్పటికి సరిగ్గా రెండుగంటలైంది. అప్పుడే పార్కులో గడియారం గంటలు కొట్టింది. ఆవలిస్తూ లేద్దామా వద్దా అనుకుంటూ ఉండగానే గది తలుపులు తెరుచుకున్నాయి.

చంద్రాస్తమానం అయిపోవడంవలన శివరావు సుమతిని గుర్తుపట్టలేకపోయాడు. శశి కూడా గుర్తుపట్టలేక పోయింది. శశి ఆ ముసుగునుచూచి భయపడి కెవ్వనకేకవేసి శివరావును గట్టిగాకౌగలించుకొంది.

సుమతి అలికిడికి గబుక్కునలేచి నిలబడి 'నేనేనండి....' అంది వంచినతల ఎత్తకుండానే.

'పాడుదానా నువ్వేటే...ఇంకా ఎవరో అనుకొని హడలిపోయాను...'శశి ఆడసింహంలా మీదకురికి ఫెళ్లుమని చెంపమీద కొట్టింది. సుమతికి నిద్రమత్తు బాగా వదిలిపోయింది. శివరావు కంగారుపడిపోయాడు. శశి తొందరపడి చెయ్యిచేసుకొంటుందని అతనెన్నడూ అను

కోలేదు. శశి నవ్వుతూ చాలా గొప్పపని చేసినిదానిలాగా శివరావు వంక చూసింది.

'ఘొమ్మంటే యిక్కడే అఘోరించావే... శివరావు దూరంగానే వుండి వళ్లు పటపటలాడించాడు.

'యింత తలతిక్క మనిషిని ఎక్కడా చూడలేదు. కట్టుకున్న పెళ్ళాంలాగా కొంప వదిలిపెట్టకుండా ఇదేం పీడని ... పంపించెయ్య రాదుటండీ మళ్లీ యీ కొంపలో అడుగుపెట్టద్దని చెప్పి' శశి తాపీగా కుడి కాలి బొటనవేలు నేలమీద రాస్తూఅంది.

సుమతి అభిమానం బాగా దెబ్బతిన్నట్లయింది.ఎడంచేత్తో చెంపని పట్టుకుని నడుం గోడకి ఆనించి "నేనేం పనిమనిషినిగాదు...పెద్దలంతా చేరి ఈయనకు చేసిన ధర్మపత్నిని'' అంది.

శశి నల్లబారిపోయి, మబ్బులు కమ్మిన చంద్ర బింబంలాగా అయింది.శివరావు ధూంధాంలాడుతూ గబగబ గదిలోకి నడవబోయాడు.

శశి అతని చొక్కాను గట్టిగా పట్టుకుని ఏదో మాట్లాడబోయి ఆయాస పడుతూ వక్కగుంజు గుంజింది.శివరావు వులిక్కిపడి వెనుక్కి వరిగాడు.

"ఒకరి జీవితాన్ని నాశనంచేసింది కాక నాజీవితాన్నిగూడా పాడు చేస్తావురా..." చూరులోనుంచి చీపురుకట్ట తీసి పెడేలుమని శివరావు ముఖంమీద కొట్టింది. సుమతి పరుగెత్తుకుంటూవచ్చి చీపురు కట్ట లాగి అవతల పారేసి "నా ఎదుట నాభర్తను కొడతావా? సిగ్గులేదూ...యిందాక నన్నవమానంచేస్తే వూరుకున్నా గాని ఆయన్ని ఏమన్నా అన్నా వంచేనా...'' అంటూ శశిమీద విరుచుకుపడింది.

శశి మరింత తెల్లబోయింది. శివరావు మాట్లాడలేదు. శశి గొంతు మరింత పెద్దదిచేసి 'నిన్నేం చేస్తానో చూడు. రేపు ఆఫీసులో నిన్ను అవమానం పాలుచేసి నీ వుద్యోగం వూడతీయించకపోతే చూడు...' హుంకరిస్తూ వాకిట్లోకి బయలుదేరింది.

సుమతి ఆమె పాదాలమీదపడి 'భర్త అవమానంపాలై వుద్యోగం

లేక అలమటిస్తుంటే ఏ స్త్రీ అయినా సహిస్తుందా చెల్లీ...నన్ను క్షమించి కరుణిస్తానని మాట యిస్తేగాని నీపాదాలు వదలను'అంది. తన తలంతా నీటి చుక్కలతో తడిసిపోగానే సుమతి కళ్లెత్తి పైకి చూసింది. శశి కళ్లు 'లే అక్కా' అంటున్నాయి. శశి సుమతిలో కలిసిపోయింది. అపరాధి విడిగా నిలబడి పోయాడు.



# చెరగని అక్షరాలు

వాన తుంపరలు కన్నీటి చుక్కల్లా నేలమీదకు బరువుగా రాలుతున్నాయి. అమావాస్య చందమామ భూమికి అడుగునే వుండిపోయింది. ఆకాశమంతా ఆవరించిన చీకటి తెరలోనుంచి చిల్లులు చేసుకుని స్వర్గం సుషుప్తిలోవున్న భూభాగాన్ని పరికిస్తోంది. వీధిలోని చీకటి, తలుపులులేని కిటికీగుండా లోపల ప్రవేశించి, గోడమీదవున్న ఆముదం దీపాన్ని భయపెడుతోంది. అప్పుడప్పుడు చెదురువాటుగా వీస్తున్నగాలికి వూగులాడుతున్న దీపశిఖ, ఆ గాలితెర తగ్గగానే ధైర్యం కూడగట్టుకుని సూటిగా నిలబడి చూస్తోంది—పొగను సూటిగా పైకివదిలేస్తూ. దాని మీద చలిప్రభావం పడ్డట్లు కనిపించటంలేదు గాని ఎదురుగా కూర్చున్న పార్వతిమాత్రం మోకాళ్లకు తలనానించి గజగజా వణికిపోతోంది. పైన కప్పుకున్న దుప్పటి ఆమెలోంచి వస్తున్న వణుకును ఆపలేక పోతున్నట్లుంది.

"తలుపు తియ్యమ్మా పారూ...." బయటనుంచి తలుపునుబాదుతూ లలితమ్మ గట్టిగా అరిచింది.

"మరీ చోద్యంగావుందే వ్యవహారం...ఇంత కంగారయిపోతే ప్రతిదానికీ ఎట్లాగే...మనిషన్న తర్వాత రోగంనొప్పి రాకుండా వుంటుందా..." లలితమ్మ తలుపు కవతలనుంచి పార్వతి నుద్దేశించి సముదాయింపు పూర్వకంగా అంటోంది. పార్వతి తడిసిపోయిన చేతి గుడ్డను మంచంకిందకు తోసేస్తూ "వస్తున్నా నమ్మా" అని తలుపు తీసింది--తలుపు తెరచుకోటంతోటే పార్వతిని చేతుల్లోకి తీసుకుని 'వెర్రిపిల్లా అని....ఛీ..." అంది.

"మరీ యిదిగా వుందేమిటీ... మీ మామయ్యకు యింతకంటే పెద్ద సుస్తీ చేసిందిగాని యింత కంగారు ఎవ్వరూ పడలేదమ్మా.... తమ్ముడిని అనుకోరాదుగాని యిప్పుడుచూడు మనిషి ఎట్లావున్నాడో...." పార్వతి కళ్ళకు కొంగు అద్ది "కొద్దిగా మెతుకు ఎంగిలి పడమ్మా...

మామయ్యేమో విస్తరిముందు కూర్చున్నాడు...నువ్వు రాందే అన్నం తినడు....పోనీ వాడికోసమైనా రారాదుటే..."

పార్వతి మెల్లిగా లలితమ్మ కౌగిలి వదిలి వంటింటివైపుకు కదిలింది. కాళ్ళు కొద్దిగా నీరసించి తడబడుతున్నా తల్లి భుజంమీద చెయ్యి వేసి అడుగులు మెల్లిగా వేస్తూనేవచ్చింది.

"ఏం పారూ...అట్లా బేజారయిపోతారుటే......నా కెంతసుస్తీ చేసిందో నీకేంతెలుసు....మీ అత్తయ్య ఏమైనా మనిషి కదిలిందా... మనిషిఅంటే అట్లా వుండాలి...ఏమే సావిత్రీ...' గోపాలరావు నోటి వెంట మాట పూర్తికాగానే పార్వతి చిరునవ్వు నవ్వబోయి సావిత్రిని చూసి వూరుకుంది. సావిత్రి చేతిలో గరిటెకిందపడేసి పార్వతినిచూసి పక్కున నవ్వింది.

'అన్నానికి కూర్చుంటానుగాని... ఆ ప్రమిదలో చమురుందేమో చూసిరావే అమ్మా!'

'ఏం? చీకట్లో రాములవారికి గదిలో సామాన్లన్నీ కనపడవనా... ఉంటే వుంటుంది...పోతే పోతుంది గాని .... నాక్కొంచెం అన్నం పట్టుకురావే అక్కయ్య...'

పార్వతి చివాలునలేచి గోపాలరావువంక వకసారి తీవ్రంగా చూచింది. తనగదిలో వెలుతురులేక పోయినా ఫరవాలేదనే టప్పటికి గుండె జల్లుమంది పార్వతికి.

'నువ్వు అన్నంఅనంగతే చూసుకో· అమ్మా....నాదీపం సంగతి నేనేచూసుకుంటానులే' అంటూనే పార్వతి గదివైపు గబగబ నడిచింది.

వీధి తలుపు నెవరో బాదినట్లు చప్పుడయింది. గోపాలరావు అన్నం కలుపుకోవటానికి ఉద్యుక్తుడవుతూ—

'వాకిట్లోకి ఈవానలో వచ్చారెవరో ... చూసిరావే సావిత్రీ' అన్నాడు. సావిత్రి గడపలోనే నిలబడింది—లలితమ్మ వీధి తలుపువైపుకు పోవటంచూసి.

'వస్తున్నానండీ....ఎవరో వక్కక్షణం ఆలస్యంఅయితే సరి... తలుపు నట్లా బాదుకుంటారు...ఊ....' అంటూ సణుగుతూ వెళ్ళింది.

తలుపుయింకా చప్పుడు అవుతునే వుంది—లలితమ్మ గడియతీసి తలుపు తెరిచేవరకూ. బయటి చీకటిలో దీపంలేని సైకిలుమీద గొడుగు వేసుకుని వచ్చిన వ్యక్తి ఒక కాలును నేలమీద మోపుతూ సైకిలుమీదనే కూర్చుని కనపడ్డాడు. లలితమ్మ చీకటిలో బయటికిపోవటానికి సందేహించింది బయటిమనిషి గొడుగును మెడతో గట్టిగా పట్టుకుని సైకిలుదిగి.

'అయ్యగారున్నారా?' అన్నాడు. సావిత్రి వంటింటి గుమ్మంలో నుంచే.

'అన్నం తింటున్నారుగా.... కాసేపు అరుగుమీద కూర్చోమని చెప్పండి అత్తయ్యా!' అంది. పార్వతి ప్రమిదమాట మరచిపోయి కిటికీలోనుంచి వస్తున్న చలిగాలికి కొద్దిగా కంపిస్తూ-

'ఏమి కావాలో కనుక్కోరాదుటే అమ్మా' అంది.

గోపాలరావు కంచం ముందరనుంచి లేచి వాకిట్లోకి వస్తూ 'ఎవరండీ వాకిట్లో.... లోపలకు రండి' అన్నాడు. లలితమ్మవైపు తిరిగి 'అక్కయ్యా....అట్లా వాకిలికడ్డంగా నిలబడకబోతే ఆయన్ని లోపలకు రానీయరాదుటే' అన్నాడు.

'దణ్ణాలండీ....అయ్యగారికి అర్జెంటు కాగితం యిచ్చేదుంటే' నసిగాడు వాకిట్లో మనిషి అక్కడినుంచే. చలి విచక్షణలేకుండా గోపాల రావునుగూడా గజగజలాడించింది. వాకిట్లోకివచ్చి పెలిగ్రాం అందుకుని కాగితంమీద సంతకంపెట్టి "మామూలు రేపొద్దున యిస్తాలేరా.... మళ్ళీరా" అన్నాడు. బయటి బంట్రోతు సైకిలుమీద ఎక్కుతూ "పాపిష్టోణ్ణి....నాకు మామూలు ఎందుకులే అయ్యా" అన్నాడు.

పార్వతి పరుగెత్తుకుంటూ వచ్చింది. సావిత్రి చెయ్యి కడుక్కుని కొంగుకు తుడుచుకుంటూ మెల్లగా సావిట్లోకి వచ్చింది.

"ఏరాగోపీ...ఈవాళ్లప్పుడు మనింటికి వుత్తరం వచ్చింది...." అంది లలితమ్మ ప్రతి అక్షరాన్ని సాగదీస్తూ.

"మీతో ప్రతిదానికి చావొస్తోందే...ఎందుకు యీ హడావుడి... ఘుబిగుబలూనూ....ఆ " గుండె దడను మాటలలో దాచుకోలేక తడబడుతూ అన్నాడు, కవరు పకప్రక్కన వంకరగా చించేస్తూ.

పార్వతి సావిత్రికి వెనకాలగా నిలబడి రెండుసార్లు 'అత్తయ్యా... అత్తయ్యా'' అంటూ పిలిచింది. గోపాలం టెలిగ్రాం పూర్తిగా చదవకుండానే ''అక్కయ్యా...'' అంటూ లలితమ్మ కాళ్లమీదకు వరిగిపోయాడు. లలితమ్మ గుండె బాదుకుంటూ:

''ఏమయిందిరా గోపీ...నా కొంపకు ఏంయిక్కట్టు వచ్చిందిరా దేవుడా'' అంటూ రాగాలు తీయటం మొదలుపెట్టింది. సావిత్రి అతని చేతిలోని ఉత్తరం వక్కసారిగా గుంజి:

'.ఏమయిందండి . . మాట్లాడరేం'' అని టెలిగ్రాం గబగబా నాలుగుముక్కలూ చదివేసి పార్వతికోసం వెనక్కు తిరిగింది. పార్వతి కళ్లు ఎర్రగా జ్యోతుల్లాగా వెలిగిపోతున్నాయి. సావిత్రి ఏదో మాట్లాడటానికి పెదవి కదల్చబోయింది. పార్వతి:

'అత్తయ్యా...ఇప్పుడేవస్తా ప్రమిదలో నూనెపోసి వక క్షణం ఆగు...' అంటూ గదిలోకి పరుగెత్తబోయి జారిపోయిన చీరె కొంగు కాలికి తగులుకుని గభాలున గదిముందరపోయి పడ్డది. ఆగాలికి అసలే నూనె లేనిదీపం గబుకున ఆరిపోయింది. కొడిగట్టిన దీపాన్ని ఆసరా చేసుకుని నివసిస్తున్న పొగ దానిని వదిలి పైకి వెళ్ళిపోయింది.

'అమ్మా దీపం పోయిందే' అంటూ పార్వతి బిగ్గరగా అరిచింది. లలితమ్మ పార్వతిని లేపతీసి వళ్ళోకి తీసుకుని:

'అవునే తల్లీ మన దీపం ఆరిపోయిందే... తల్లీ దేవుడో' అంటూ బిగ్గరగా రోదించటం మొదలు పెట్టింది. పార్వతి తల్లివైపుచూసి విషాదంగా నవ్వుతూ 'నేననుకున్నదేనమ్మా' అంటూ గొణిగింది.

సావిట్లో గచ్చుమీద మూలగా పడుకున్న పార్వతి పగిలిపోయిన గాజు పెంకులవంక చూస్తోంది నిలువుగుడ్లు పెట్టుకుని. ఎడంచేతి, పని అయిపోగానే కుడిచేతి గాజులవంక చూస్తూ లలితమ్మ ఏమనాలోతోచక పార్వతిమీదపడి 'అయ్యో...నేను బ్రతికుండగానే యిటువంటి కష్టం వస్తుందని అనుకోలేదే తల్లీ' అంది. పార్వతి నిర్లిప్తంగా అటువైపు చూస్తూ కుడిచెయ్యి బలవంతంగా లేపి పక్కకు తిరిగి ఎడంచేతిపక్కన పెట్టింది. కంగు కంగు మంటూగాజులు చితికిపోతుంటే పార్వతి కంటి

వెంట వక్కొక్క బాష్పంరాలి చెక్కిళ్ళకిందకు జారకుండానే అరిపో తున్నాయి.

"పది గంటల బండీకి రామాపురం పోదాం అక్కయ్యా.... పెట్టెలో నాలుగు బట్టలు సర్దు" గోపాలరావు ఇంట్లో హడావుడికొంచెం సర్దుకోగానే మెల్లిగా లలితమ్మతో అన్నాడు. పార్వతి అతనివంక నిర్ల క్ష్యంగా చూసి ముఖం లలితమ్మ వళ్ళోకి దాచుకుంది.

"నేను బజారుకుపోయి వచ్చేలోపుగా అన్నీ సర్ది సిద్ధంగా వుండండి ... " గోపాలరావు వుత్తరీయం భుజాన వేసుకుని "సావిత్రీ....ఆ సంచీ యిటు తీసుకురావే .... బజారుకుపోయి పదినిమిషాల్లో వస్తాను" అన్నాడు. సావిత్రి దండెంమీద వేసిన సంచీ వంక చూస్తూ 'అందదన్నట్లు' నిలబడింది. గోపాలరావు సంచీని పైనుండి అందుకుంటూ—

"ఏ మక్కయ్యా...వచ్చేపొద్దా...పోయేపొద్దా. తొందరగా లేచి ఆ పనేమిటో చూడరాదూ... రెండు మెతుకులు నోట్లో వేసుకుని మళ్ళీ బయలుదేరాలమ్మో...మనకోసం బండీ ఏమన్నా ఆగుతుంది గనకనా" అన్నాడు. లలితమ్మ కళ్ళనీళ్లు కొంగుకి తడుచుకుంటూ

"నీతిండి పాడయిపోను.... యిక్కడ వకమూల చచ్చి యేడుస్తుంటే నీతిండి తాపత్రయం...ఇదై పోతుందా...యివ్వాళ పొయ్యిమీద బియ్యం ఎక్కడానికి వీల్లేదు."

"అయ్యో నాతల్లీ...ఎంత ఆపదవచ్చిందే"....పార్వతి తల్లిని ఇంకా గట్టిగా కౌగలించుకొని "అమ్మా...అమ్మా"అంటూ బావురు మంటోంది.

"సావిత్రీ నువ్వన్నా చూడవే...తిండిసంగతి ... వాళ్ళనట్లా కాసేపు కదలకుండా వుండనీ..."

"అయ్యో...మరీ వుప్పలాయిగా వుందేమండీ.... మీ మొండి పట్టు యిటువంటప్పుడు మానకపోతే ఎట్లాగండి ... ఛీ ... " అంటు విసుక్కుంటూ వంటింట్లోకి వెళ్ళింది.

"అంతా కట్టకట్టుకుని ఏడవండి...ఏడిస్తే తీరే దుఃఖమా...

నేనుగూడా ఆడదానిలా ఏడవలేక వూరుకున్నా గాని...నాదుఃఖంలో పకపంతు—" గోపాలం వుత్తరీయంతో ముఖం గట్టిగా తుడుచుకుని సావిట్లో ఒక మూలకి గిరవాటు వేశాడు.

"మనం ఏం చెయ్యగలం అక్కయ్యా..." లలితమ్మ దగ్గరకు పోయి చతికిలబడ్డాడు. లలితమ్మ అతని భుజంమీద చెయ్యివేసి "త...మ్ముడూ" అంటూ ఆవురుమంది.

"మనం ఏం చేస్తాం అక్కయ్యా...నాకూ యింతరోగమూ వచ్చిందా...ఏమయింది...యింత యిక్కట్టు వస్తుందని కలలోగూడా అనుకోలేదు." పార్వతి... అతని కళ్ళల్లోకి సూటిగా చూసింది. ఆమె కనురెప్పలు నల్లగుడ్లను గాలికి వదిలేసి నిశ్చింతగా నిలిచి వున్నాయి. నుదురు అదురుతోంది. పెదవులు అస్పష్టంగా వణుకుతున్నాయి.

"అట్లా చూడక పారూ...నావంక...వద్దు పారూ అట్లా నావంక చూడకు..." గోపాలరావు పార్వతి వంకచూస్తూ రెండు చేతులూ కళ్ళకు అడ్డంపెట్టుకున్నాడు. సావిత్రి మెల్లిగా పార్వతి ప్రక్కకు చేరింది.

"పారూ...నావంక చూడమ్మా..." పార్వతి సావిత్రి వంక చూడకుండానే తల్లిఒళ్లో ముఖందాచుకుంది.

'సావిత్రీ....కాసిని మంచినీళ్ళు తీసుకురా అమ్మా' .....గొంతు ఆర్చుకుపోయినట్లుంది పార్వతికి!....

"అట్లాగే అత్తయ్యా...."

"పారూ....ఏడవకమ్మా.... ఏం చెయ్యగలం ఇప్పుడు"అన్నాడు గోపాలరావు.

పార్వతి తల్లివడిలోనుంచి విడివడి కూర్చుంది గోపాలరావు వంకకు తిరిగి. ఆమె బలవంతాన పెదవులు కదిపి:

"అవును, యిప్పుడు చెయ్యగలిగింది ఏముంది .... చెయ్యగలిగినదంతా అదివరకే చేసేశారు...."అంది ఆగ్రహంగా.

"ఆ..."అంటూ అదిరిపడ్డాడు గోపాలరావు. అతని మెదడులో గతించిన చరిత్రంతా పుటలు తిరగవేస్తూ ప్రత్యక్షమయింది. పార్వతి ముఖంలో రోగిష్టి భర్తృబింబం కనపడుతోంది.

"చెయ్యగలిగిందంతా అదివరకే చేశారు. చిన్నతనంలోనే గొంతుకకు వురిపోశారు...యిప్పుడు చెయ్యగలిగినదేముంది వురి బిగిసి పోయిన తర్వాత..."

'అదేమిటే పార్వతీ...అదేమిటే కన్న కూతురుకు వురిపోసుకుంటారుటే...అవేం మాటలే!....'

'అడుగు మీ తమ్ముణ్ణి అడుగు'—'తమ్ముడు' అంటూ వ్యంగ్యంగా వచ్చినమాట శూలంలా గుచ్చుకుంది గోపాలం హృదయానికి. పార్వతి వంక అతను చూడటానికి భయపడ్డాడు. అక్కడినుంచి లేచి వంటింటి వైపుకు ముఖం తిప్పి:

'నేనేం చేశాను...' అంటూ గొణిగాడు. పార్వతి హృదయం బద్దలైంది. ముఖం జేవురించింది.

'అంతా నువ్వే చేశావు... నా పచ్చని జీవితంలో నిప్పులకుంపటి పెట్టావు...ఆయన కా సుష్టి మొదటినుంచీ వుందని మీకందరికీ తెలియదూ.... ఆతని ఆస్తికి ఆశపడి...ఎదురువచ్చే సొమ్ములకు వ్యసన పడి...అమ్మా...నా గొంతు కోశారే...' బిగ్గరగా అరుస్తూ లలితమ్మ వళ్ళోకి వరిగిపోయింది పార్వతి. గోపాలరావు పిచ్చెత్తినవాడిలా అయిపోయాడు. లలితమ్మ అతనివంక తీవ్రంగా చూస్తూ 'ఏంరా...ఆయనకీ సుష్టి వున్న సంగతి తెలుసురా నీకు....మాట మాత్రంగానైనా చెప్పలేదేంరా నాకు' అంది గట్టిగా.

"అదేం లేదక్కయ్యా" మాటతడబడిపోతోంది గోపాలరావుకు. "కొద్దిగా దగ్గువచ్చేదిట చిన్నప్పుడు...జలుబు మనందరికీ వున్నట్లే అతనికీ వుండేదిట....అంతే."

"అంతేనా"—పార్వతి కంయి మంటూలేచింది. "అతనికి రోజూ జ్వరం వచ్చేదిగాదూ....నోటివెంబడి నెత్తురు పడేదిటగాదూ ...యివన్నీ అబద్ధాలా?'' సావిత్రి ముఖం తప్పించుకుంది. లలితమ్మ అందుకుని—

"ఏరా మాట్లాడవేం" గోపాలరావుని గట్టిగా గద్దించి అడిగింది.

"ఎప్పుడన్నా వచ్చేదిట అక్కయ్యా"

''అవన్నీ వప్పుకున్న వాడివి...అతనికి క్షయ వున్నదని చెప్ప డానికి దాపరిక మెందుకు...నా జీవితాన్ని నీ సౌఖ్యంకోసం నాశనం చెయ్యటానికి సాహసించావుగాని, కావాలంటే నీవు కోరినపైకం ఎక్కడైనా ముట్టచెత్తుకుని యిచ్చేదాన్ని గాదూ నీకు..." పార్వతి ముఖం వివర్ణమైపోయింది. ఊరికే రొప్పుతోంది. పిచ్చిదానిలా జుట్టు చేతుల్లోకి తీసుకుని "మీరంతా దొంగలు...నన్ను చంపుతున్నారు.... పురి బిగుసుకుపోతోంది...అమ్మా...అమ్మా ....'' అంటూ అరవటం మొదలు పెట్టింది.

లలితమ్మ కంగారుపడ్డది. ఎన్నడూ నోరెత్తిమాట అనని పార్వతి ఎందుకు అట్లా గొంతు చించుకుని అరుస్తోందో అర్థంగావటం లేదు. దుఃఖంలో ఆపురావురుమని ఏడవటం ఎరుగుందిగాని యిటు వంటి వెర్రికేకలు వింటుంటే పార్వతికేమైనా మతిభ్రమించిందేమోనని భయపడింది.

'ఒరేయి గోపాలం:..నా కొంపకేదో ముప్పు వచ్చిందిరా నాయనా... డాక్టరును పిలుచుకురా రా ... ముందర .... తొందరగా పోయిరా రా నాయనా...'లలితమ్మ పార్వతిని కదలకుండా ఒళ్లో పెట్టుకుని అదుముకుంటోంది.

"నాకేం పిచ్చెత్తలేదు...దయ్యంగూడా పట్టలేదు....నన్ను పిచ్చిదాన్ని చేసి నాజీవితాన్ని నాశనంచేశారు...మల్లెచెట్టు పీకివేసి తుమ్మచెట్టు నాటారు....యింకా డాక్టరు ఎందుకు...'' పార్వతి ముఖంలో ఎరుపు దనం తగ్గి కొద్దిగా తెల్లబడింది. చిరునవ్వు పొడగూడా కనపడింది. ఒక్కసారిగా విరగబడి నవ్వుతూ 'ఏం మామయ్య నన్ను పెళ్ళిచేసికో రాదూ.....నువ్వు...సావిత్రి అత్తయ్యను వీధిలో వదిలిపెట్టేద్దు గానిలే...' అంది. సావిత్రి కంగారు పడింది. పరుగెత్తుకుంటూ పార్వతి దగ్గరకు పోయి 'నన్నేమనక పారూ...నాకేమీ తెలియటం లేదు...అంతా అయోమయంగా వుంది' అంది. లలితమ్మ మాట్లాడలేదు. గోపాలరావు స్తబ్ధుడైనాడు. సావిత్రి పార్వతి నానుకుని 'బిగ్గరగా మాట్లాడ

పడవమ్మా' అంది. 'నాకు తెలుసులే' అన్నట్లు పార్వతి పెదవి విరిచి కళ్లు మూసుకుంది.

గోడ గడియారం గంటలుకొట్టలేక కొట్టలేక విషాదంగా మూలిగింది. దాని రొటాకు చప్పుడు గంటలు ఆగిపోయిన తర్వాత కొద్దిసేపటి దాకా గది అంతా మూగధ్వని నిచ్చింది. పార్వతి కళ్ళు తుడుచుకుని "అమ్మా రామాపురం తప్పకుండా పోవలసిందేనా?" అంది. లలితమ్మ అక్కడలేదు.—అప్పటివాకా యింట్లో జరిగిన సంగతులేవీ పార్వతికి తెలియవు. ఆ పదినిమిషాల నిద్రలోనూ ఆమె కలలో చనిపోయిన భర్త నీడగావచ్చి "నన్ను ఒకసారివచ్చి చూసిపోవూ" అంటూ ప్రాధేయపడ్డట్లు కనిపించింది. అతని వంకచూసి ముఖం ముడుచుకుంది గాని అతను ప్రాధేయపడటం చూసేటప్పటికి ఆమెగుండె నీరయింది.

"సుష్టి నయమయి బాగపడతానని అనుకున్నా గాని, యిట్లా అర్థాంతరంగా కథ ఆగిపోతుందనుకో లేదు పార్వతీ... అటువంటి సందేహం లేశమాత్రంగా నయినా వుండివున్నట్లయితే...నీ జీవితంలో తెలిసి నిప్పులు పోస్తానా పార్వతీ...నన్ను నమ్మవూ" అతనుయింకా ప్రాధేయపడుతున్నట్లు పార్వతి కళ్ళముందర కనపడుతోంది.

"పార్వతీ...నువ్వు అన్యథా భావించకపోయినట్లయితే నా ఆత్మ శాంతికోసం వొక్కపని చెయ్యవూ! నేను ఎప్పటికీ నీకు కృతజ్ఞుడనై వుంటాను...నా శాంతి కోసం పారూ...అదీ స్వార్థమే అనుకో...నువ్వు మళ్ళీ పెళ్ళి...."

పార్వతి కళ్ళవెంబడి నీరు జాలువారుతున్నాయి. మళ్ళీ పెళ్ళిమాట తలపుకు వచ్చేటప్పటికి కళ్ళు బాగా గట్టిగా నులుముకుని చేతులు కళ్ల ముందర వూపింది — ఆ నీడను వదిలించుకోవటానికి, ఆమెభర్త నీడ వచ్చి నట్లుగానే గాలిలో కలిసిపోయింది.

"ఏమిటి పారూ...యిందాకటినుంచీ కలవరిస్తున్నావు ..." లలితమ్మ పార్వతిదగ్గరకువచ్చి బుజ్జగింపుగా అడిగింది. వాకిట్లో వంటెద్దు బండి చేస్తున్న గజ్జెల గలగల పార్వతికి కాలయముని గజ్జెల ఘణఘణలా వినిపించింది.

"అక్కడికి వెళ్ళక తప్పదా అమ్మా..."

గోపాలరావు బండీలో పెట్టె పెట్టివచ్చి చేతులు దులుపుకుంటూ-

"ఇంకా ఏమిటి అక్కయ్యా ఆలస్యం...బండికి టైమయిపోతుంటేను..." హడావుడిగా అన్నాడు. పార్వతి లేచి మెల్లిగా అడుగులు వేసుకుంటూ బయటికి వచ్చింది- లలితమ్మ భుజంమీద చెయ్యివేసుకుని.

బండి స్టేషనుకు చేరేటప్పటికి రైలు రానే వచ్చింది. బండిమనిషి ఎద్దు మెడతాడు బండిచక్రానికి కట్టేశాడు, బండి అటూ యిటూ కదలకుండా వుండటానికి. గోపాలరావు జనసమూహంలోనుంచి తోసుకుంటూ పెట్టెను ప్లాటుఫారంమీదికి చేరవేశాడు. బండిమనిషి గోపాలరావుచేతిలో పెట్టెని కిందకు అందుకుంటూ:

'మీరు పోయి టిక్కెట్లుసూక్కరండి.... నేను పెట్టెలట్టుకొస్తాగందా' అన్నాడు. పార్వతి బండీ దిగి పెద్ద పెద్ద అంగలు వేస్తూ గోపాలరావు దగ్గరకువచ్చి:

'నాకు సెకండు క్లాసు టికెట్టు తీసుకో మామయ్యా....మూడో క్లాసులో నేను కూర్చోలేను' అంది. గోపాలరావు మాట్లాడకుండా బుకింగ్ ఆఫీసుకు బరువుగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

పార్వతిని సెకండుక్లాసు కంపార్టుమెంటులో ఎక్కించి బండీకి టయం అయిపోవటంవల్ల 'అమ్మా వాళ్ళదగ్గరకుపోతాను పారూ. బండి టయం అయింది మరి....మళ్ళీ పై స్టేషనులోవచ్చి కలుసుకుంటానులే' అన్నాడు. ఆమె చింపిరి జుట్టు, కుంకుమ లేక వెల వెలబోతున్న ఆమె ముఖం, బోసిపోయిన ఆమెచేతులూ అతన్నివెక్కిరిస్తున్నాయి ముఖం వెనక్కు తిప్పేసుకుని ఆర్ద్రమైన స్వరంతో పోతున్నా పారూ' అన్నాడు. పార్వతి అతని మాట వినిపించుకోకుండానే దభీలున తలుపువేసి లోపలకు వెళ్ళిపోయింది.

బండి బయలుదేరినప్పటినుంచీ లలితమ్మా సావిత్రీ అదేపనిగా మాట్లాడటం మొదలుపెట్టారు. రామాపురంలో చూడబోయే పరిస్థితులు, జరుగుతున్న పరిస్థితులు, పార్వతి భావి జీవితం మొదలైనవి చర్చలోనికి వస్తున్నాయి. సావిత్రి మటకు లలితమ్మ ఏమాటన్నా ఊఁకొట్టి వూరుకుంటోంది. గోపాలరావు రెట్టిస్తున్నాడు ప్రతిమాటకీ. ఆ పెట్టెలోనే

యిద్దరు ముగ్గురు ముసుగులుపెట్టి పడుకున్నారు. ఆడవాళ్లో మొగవాళ్లో గూడా తెలియటంలేదు. మధ్య మధ్య ముసుగులోనుంచే అటూ యిటూ మసులుతున్నారు. మధ్య మధ్య కలవరిస్తున్నారు గూడా. ఆముసుగులను చూస్తుంటే అంతకుముందు జరిగిన ఏదో విషాద సంఘటన ఛాయా మాత్రంగా స్ఫురిస్తోంది. లలితమ్మకు నిద్ర ఉండుండి మగతగావస్తోంది. సావిత్రి పక్కకు జరిగి లలితమ్మ నిద్రపోవటానికి చోటిచ్చింది. లలితమ్మ జారి పడబోయి పులిక్కిపడి లేచింది.

"ఏరా గోపాలం.... పార్వతి నొకసారి చూసిరారా...ఎట్లావుందో ఏమిటో... ఎంత వద్దన్నా దాని మొండిపట్టేగాని వక్కతే అక్కడా... నలుగురికీ ఆ క్లాసే కొనరా అంటే డబ్బు లేదో అని నీ గొడవ...ఛీ.... సరే నామాటలకేం గాని వకసారి చూసిరారా" లలితమ్మ దవడలు నొక్కుకుంటూ నాలుగు పక్కలా పరికించింది.అంతా మగత నిద్రలోవున్నారు. బయటినుంచి చలిగాలి 'ర్వ్వు'మంటూ వస్తోంది. మధ్య మధ్య మిణుగురు పురుగులు గాలికి ఎగిరిపడి వస్తున్నాయి లోపలకు. రైలు వేగంతోపాటు హెచ్చుతూ తగ్గుతోంది లోపలి ఎలక్ట్రిక్ దీపం.

"స్టేషను వస్తున్నట్టుందే.. యిక్కడ దిగి చూసిరారా. వీలయితే అక్కడే కాసేపువుండి.. ఏవైనా మంచిమాటలు నాలుగు చెప్పిరా.." అంది.

"ఇది అప్పుడే మన వూరినుంచి నాలుగో స్టేషను.ఇప్పుడే స్టేషను వచ్చినట్లు మాట్లాడుతున్నావు....చూసివస్తాలే...."అన్నాడు గోపాలరావు కూర్చున్నచోటినుంచి లేచి వాకిలివైపు పోతూ.

"నాలుగు స్టేషన్లు వస్తే యిందాకటినుంచీ ఏం చేస్తున్నావురా" అంది లలితమ్మ విసుగ్గా మెటికలు విరుస్తూ.

బండి కూతకూస్తూ వేగం తగ్గించి మెల్లిగా పోతోంది.చూస్తుండగానే సిగ్నలు దాటిపోయి స్టేషనుగూడా వచ్చేసింది. తనపెట్టెలోకి ఎక్కటానికి వచ్చేవాళ్లను తోసుకుంటూ కిందకు దిగి, పార్వతివున్న పెట్టెదగ్గరకు మెల్లిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళాడు.తలుపులోపల వేసివుంది. బయటనుంచి తీయటానికి సర్వవిధాలా ప్రయత్నం చేశాడు. తలుపును

నాలుగైదుసార్లు కొట్టిచూశాడు. అప్పటికీ తలుపు. రాకపోయేటప్పటికి గాబరాపడుతూ పోర్టరును పిలుచుకురావటానికి పరిగెత్తాడు. ప్లాటుఫారం ఆ మూలనుంచి ఈమూలదాకా రెండుసార్లు తిరిగినా ఒక్కడూ కనపడ లేదు. టిక్కెట్టు కలెక్టరుతో చెపితే పని వుందంటూ హోటలులోకి దూర బడ్డాడు. గోపాలరావు అయోమయంలో పడ్డాడు ఏం చెయ్యటానికి తోచక బండి బయలు దేరేటట్టుగా వుండేటప్పటికి పార్వతివున్న పెట్టె వాకిలిదగ్గ రకు పరుగెత్తాడు. ఫుట్‌బోర్డుమీద నిలబడి కట్టీబట్టుకున్నాడు. బండీ బయలుదేరింది.

బండీ ప్లాటుఫారం దాటగానే తలుపు దానంతటఅదే తెరుచు కుంది. 'అమ్మయ్య' అనుకుంటూ బండీలోపల అడుగుపెట్టి తలుపును పూర్తిగా తోసేసి లోపలకు వెళ్ళాడు. గప్పుమని అత్తరువాసన ముఖా నికి కొట్టేసింది. నిర్ఘాంతపోయాడు తను పొరబాటున తప్పు పెట్టెను ఎక్కాలేమోనని. వాకిలినుంచి తలబయటకు పోనిచ్చి పెట్టె నెంబరు చూశాడు. తను గుర్తు పెట్టుకున్నదే సంశయంతో బెరుకుగా అడుగులు వేస్తూ లోపలకు వచ్చాడు.

'ఏం మామయ్యా ... అట్లా కంగారుపడుతున్నావు' పార్వతి నింపాదిగా సోఫాలో పడుకుని అడిగింది గోపాలరావు కళ్ళు తిరిగిపోయి నాయి. ఎర్రటి తిలకం నుదుట ఎలక్ట్రిక్ బల్బు కాంతిలో మిలమిల లాడుతోంది. మల్లెపూలు సోఫానిండా విరజిమ్మబడివున్నాయి. పెద్ద మల్లె పూలచెండు చుట్టచుట్టుకుని పార్వతి కొప్పులో కూర్చునివుంది. ఆపూలన్నీ గాత్రం విప్పి గానంచేస్తున్నట్లు కనబడుతున్నాయి గోపాలరావుకు. ఘుమఘుమలాడుతున్న ఆపెట్టె.... ఆ వాతావరణం.... పెట్టె తలుపులన్నీ మూయబడి వుండటంవలన పెట్టెలో గాలికి రాకపోకలు లేక నులి వెచ్చగా ఉంది. స్విచ్‌బోర్డులో అగరువత్తుల కట్ట వకటి నిలుపునా కాలి పోతోంది.

పార్వతి చిరునవ్వు నవ్వుతూ "ఏం మామయ్యా .... బావుందా" అంది. ఆమె ముఖం విప్పారింది. ఆమె తలలోని పూలన్నీ కిలకిలా నవ్వుతున్నాయి. గోపాలరావు కళ్ళు నులుముకున్నాడు. పార్వతికి తెలియ

కుండానే ఎడంకాలిని కుడికాలి గోరుతో గీరుకుని చూశాడు అతను చూస్తున్నది కలా...నిజమా అనే సంశయంతో.

"పారూ...ఇదంతా ఏమిటి..."అన్నాడు అమితాశ్చర్యపడుతూ.

"కూర్చో మామయ్యా....చెప్తానుగా...." అంది పార్వతి. ఆమె ముఖం యింకా నవ్వుతునేవున్నది.

"నేను మళ్ళీ పెళ్ళి చేసుకుంటాను మామయ్యా....ఈసారి మంచి సంబంధం చూసిపెడతావుగదూ" గోపాలరావుకు పిచ్చెత్తినట్లయింది. పార్వతికి పిచ్చెత్తిందేమోనని భయపడ్డాడు.

"పార్వతీ! " అంటూ బిగ్గరగా అరిచి గొలుసు లాగటానికి లేవాడు దానివంక చూస్తూ. పార్వతి గభాలున అతని చెయ్యిపట్టుకుని "కూర్చో మామయ్యా ... తొందరపడకూ ..." అంది ప్రతి అక్షరాన్నీ సాగదీస్తూ గోపాలరావు మాట్లాడకుండా సోఫాలో కూలపడ్డాడు.

"నేను పెళ్ళిచేసుకుని సుఖపడటం యిష్టంలేదా మామయ్యా"

"పార్వతీ...పక్క గంటలో యిలా మారిపోయావేమిటి..."

"నిజం చెప్పు మామయ్యా ... గుండెలమీద చెయ్యివేసుకుని చెప్పు...నా సుఖం నువ్వుకోరటం లేదా...?"

"మళ్ళీ పెళ్లా...మన శాస్త్రాలు ఎలా ఒప్పుకుంటాయి" గోపాలరావు మూర్ఖంగా—వెలుగుతున్న బలుబువంక చూస్తూ అన్నాడు. పార్వతి అతనిచేయి పట్టుకుని "మన శాస్త్రాలన్నీ మనం రాసుకున్నవేగా మామయ్యా...మనల్ని బాధపెట్టేవి మన కెందుకు?" అంది. గోపాలరావు ఆలోచనలో పడ్డాడు. అతని ఆలోచనలో స్మృతులూ, శ్రుతులూ వరుసాగ్గా నీడల్లాగా కనబడుతున్నాయి.

"వీల్లేదు పారూ...మళ్లీ పెళ్ళి వీల్లేదు...మన మతం హర్షించదు...మన పెద్దలు వప్పుకోరు...వీల్లేదు పారూ...నన్నిలాంటి ప్రశ్నలు మళ్లీ అడగవద్దు..." అన్నాడు. పార్వతి సంచీలోనుంచి అద్దంతీసి ముఖం చూసుకుని కుంకుమ సర్దుకుంది సగర్వంగా చూసుకుంటూ.

"ఈ సామానంతా ఎక్కడిది పారూ?" వెలుగుతున్న అగరువత్తులకట్టవంక చూస్తూ అడిగాడు.

"ఈ పెట్టెలో నేనెక్కిన తర్వాత చాలా స్టేషనులు వచ్చాయి మామయ్యా..."

గోపాలరావు మౌనం దాల్చాడు. అటూ ఇటూ చూస్తూ ఆ పూల వాసన దొంగతనంగా ఆఘ్రాణిస్తున్నాడు. అగరువత్తుల మీదనుంచి వస్తున్న సువాసన మత్తును కలిగిస్తోంది.

పార్వతి గోపాలరావుకు యింకా దగ్గరగా జరిగి 'మామయ్యా' అంది. ఆమె గాత్రంలోని తొట్రుపాటు గోపాలరావు గ్రహించకపోలేదు. అతనికేదో మైకం కమ్మినట్లయింది. పిచ్చిగా ఆమెవంక చూస్తూ 'ఇదంతా ఏమిటి పారూ...నన్నిట్లా ఎందుకు హింసిస్తావు' అన్నాడు. ఆమె అతని చేతులను మృదువుగా తాకుతూ-

"ఏం మామయ్యా....నాశనమయిన నా జీవితంలో వక్క మధుర రాత్రిన్ని గూడా సహించలేక పోతున్నావా...బీటు వారిన నా హృదయ క్షేత్రంలో వక్కమలె మొక్క నాటటానికి వెనుకాడుతున్నావా...నాకు మనశ్శాంతి కావాలి మామయ్యా....ఈ వక్కరాత్రి నాజీవితంలో వసంతంగా వెళ్ళి పోనియ్యవూ....నీ కెప్పటికీ కృతజ్ఞురాలినిగా వుంటాను. పార్వతి చెప్పినమాటలన్నీ విని గోపాలరావు వక్కసారిగాలేచి నిలబడ్డాడు.

'ఇప్పుడే వెళ్లిపోతా...నన్ను వదిలి వెయ్యి...నన్నిలా బ్రతకనీ' అంటూ బిగ్గరగా అరిచాడు.పార్వతిలేచి అతనిచెయ్యి గట్టిగా పట్టుకుంది.

'బాగా ఆలోచించుకో...నామాట మన్నించక పోయినట్లయితే ...నీ మీద. .అపనిందవేసి నీజీవితాన్ని నాశనం చెయ్యటానికయినా వెనుదీయను....అపనింద....మొగుడు చచ్చిన ఆడదాన్ని...,నీ జీవితం నాశనంచేసికోకు మామయ్యా .... నా జీవితం శాంతంగా వెళ్ళనీ...., చెయ్యివేసి చెపుతున్నాను....నామాట మన్నించవూ..."పార్వతి గాత్రం గీరపోయింది. గోపాలరావు చలించిపోయాడు.పార్వతి కళ్లనీళ్లు తుడుచుకుంటూ "మా...మ...య్యా' అంది గంభీరంగా. గోపాలరావు ఆమెను వక్కసారిగా హృదయానికి హత్తుకుని 'పారూ' అన్నాడు. ఆపెట్టెలో.

దీపం ఆక్షణమే ఆరిపోయింది. పార్వతే లైటుతీసివేసిందని గోపాల రావుకు తెలియదు....

లైటు వెలిగేటప్పటికి గోపాలరావు బద్ధకంగా ఆవలిస్తూ సోఫా మీదనుంచి లేచాడు. పార్వతి పంపువద్దకుపోయి ముఖం కడుక్కొని వచ్చింది. కుంకుమను చెరిపిన నీళ్ళు ఆమె చెక్కిలిపక్కగా జారి ఎర్రగీతలా కనపడుతోంది. తలలో నలిగిపోయిన పూలనన్నిటినీ వుండ చుట్టి కిటికీలోనుంచి బయటకు పారేసింది. వెలుగుతున్న అగరువత్తుల గుత్తిని ఆపాటున కిటికీలోనుంచి విసిరిపారేసింది. అత్తరు తడిపిన జేబురుమాలును సునాయాసంగా కిటికీలోనుంచి వదిలిపెట్టింది. గోపాల రావు నిశ్చేష్టుడై "ఉండనీ పారేద్దువు గానిలే" అన్నాడు. పార్వతి అతని వరక కఠినంగా చూస్తూ:

"ఇంకా ఎందుకు....వీటిపని అయిపోయింది" అంది. ఇంత వరకూ సుకుమారంగా మాట్లాడిన గొంతు అంత కర్కశంగా మారే టప్పటికి గోపాలరావు తలక్రిందులయి పోయాడు.

"ఇప్పటికయినా అర్థమయిందా"—పార్వతి అతనివంక చూస్తూ వకాలుప నవ్వింది. అతనికి నవ్వాలో ఏమిచెయ్యాలో తెలియలేదు. ముఖం గంభీరంగా పెట్టి:

"ఏమిటి" అన్నాడు. పార్వతి విరగబడి మళ్ళీ నవ్వుతూ ఒక్క సారిగా ఆగ్రహం తెచ్చుకుంది.

"నా జీవితం సర్వవిధాలా నాశనం చేసినందుకు.... నీ జీవితాన్ని గూడా నాశనం చెయ్యగలిగాను మామయ్యా .... నాకు అదే తృప్తి...! మొగుడు చచ్చిన ఆడదాన్ని" ఆమాట అంటూనే పార్వతి బిగ్గరగా పిచ్చి దానిలా నవ్వింది.

"ఆ పాపం నిన్నువదిలి పెట్టదులే మామయ్యా.... నీజీవితాంతం వరకూ నిన్ను వెంటాడుతూనే వుంటుంది. నీకు యిక్కడే కాకుండా స్వర్గంలో కూడా స్థానం లేకుండా చేశాను...మొగుడు చచ్చిన...నాకేం... నేను సూటిగా స్వర్గానికే పోతాను....స్వర్గం అంటూ వకటి వుండేటట్లు యితే.... నేనేం పాపం చెయ్యలేదు... నాకు వక్కడే భర్త... ఈరోజే

నాజీవిత వసంతం... ఆ చచ్చినవాడిని నేను కోరి చేసుకోలేదు....ఆస్తి కోసం...పరపతికోసం ఆశించి....మీరు చేసుకున్నారు ఆ పెళ్ళి. దానితో నాకేంసంబంధం...నువ్వో ..కట్టుకున్న పెళ్లాన్ని వదిలి మొగుడుచచ్చిన... ఆ పాపం నిన్ను వదలదులే మామయ్యా..."పార్వతి గంభీరం వదిలి తిరిగి బిగ్గరగా నవ్వుతోంది. గోపాలరావు కంగారుపడిపోయాడు.

"అపనింద వెయ్యనని హామీ నిచ్చావుగా రాక్షసీ...మళ్లీ బిగ్గరగా అరిచావంటే..." గోపాలరావు పెద్దపులిలాగా మీదకు వురికాడు-ఆమె గొంతు గట్టిగా పట్టుకుంటూ.

'తొందరపడకు మామయ్యా...నన్ను హత్యచేసినా దాగదులే... ఇప్పుడు జరిగిందంతా జరుగుతుందని ముందుగానే తెలుసు నాకు...నేను చెపుతున్నాగా నాకు తెలుసు...అందుకనే రాశాను వక తెల్లకాగితం మీద...నా చరిత్రంతా రాశాను... తొందరపడకు. నీ చరిత్ర గూడా రాశానులే దాంట్లో... అది నలుగురికీ తెలియదూ...నవ్వరూ నలుగురూ ...ఊఁ....ఏం మామయ్యా అట్లా చూస్తున్నావు.' గోపాలరావు ఆమెను సోఫామీదకు ఒక్క తోపుతోసి.

'ఆ కాగితం ఎక్కడ...ఎక్కడదాచావు...' అంటూ అరవడం మొదలుపెట్టాడు. పెట్టె అంతా, సంచీలోనూ, పరుపుకిందా వెదికాడు గాభరా పడుతూ.

'ఏం మామయ్యా... నీకు కనపడేచోట దాచిపెట్టాననుకున్నావు గదూ...అంత తెలివితక్కువదాన్ని గాదులే.... తెలివి రానపుడు చేసిన అన్యాయానికి తెలివి వచ్చిన తర్వాత ప్రతీకారం తీర్చుకున్నాను... అయినా కాగితంమీద కాదులే రాసింది. ఒక నల్లరాతిమీద రాశాను... చెరుపుదామంటే చెరగదులే....అది కఠినశిలగదూ మామయ్యా....అందు కని' 'కఠిన శిల' అంటుంటే ఆమె గాత్రం గరగరలాడింది. ఆమె నేత్రాలు అశ్రుపూరితాలయిపోయినాయి.

" రాక్షసీ...నిన్నేం చేస్తానో చూడు ... అది దొరక్కపోతే పోయిందిలే" కాగితం దొరకని ఆవేశంలో ఆమెను గట్టిగా ఒకచేత్తో దగ్గిరకు లాక్కుని రెండుచేతులతో గొంతు పట్టుకోబోయాడు.

"వృథా శ్రమపడక మామయ్యా...నాకీ సంగతి తెలుసు... అందుకనే నీకు శ్రమలేకుండా నేనే పోదామనుకున్నాను ... ఇదుగో ఈసీసా చూడు...తాగేశానులే...పాయిజన్...అంటే తెలుసు అనుకుంటా ...నీ కెందుకు శ్రమ...దానంతట అదే పోతుందిలే ప్రాణం..."గోపాల రావు సందిగ్ధావస్థలో పడ్డాడు. విషంతాగి మరణావస్థలోవున్న మనిషితో ఎట్లా వేగాలో తెలియటంలేదు. పార్వతి తూలిపాటుపచ్చి సోఫామీద విరుచుకు పడిపోయింది. రైలు ధనధనామని చప్పుడుచేస్తూ నిర్లిప్తంగా పోతునే వుంది.

"పార్వతీ....పారూ....ఆ కాగితం ఎక్కడపెట్టావో చెప్పవూ... నీ కేం కావాలంటే అది చేస్తాను" గోపాలరావు ఆమెగడ్డం పట్టుకు బ్రతిమిలాడుతున్నారు.

"నాకేం చేస్తావు మామయ్యా....వెళ్ళిపోతున్న దానికి....కాగితం ఎక్కడపెట్టానో చెబితే చించివేద్దామనిగదూ ... ఆ ... కాగితంమీద కాదని చెప్పానుగా రాసింది....నల్లరాతిమీద రాశాననిగూడా చెప్పానుగా ....అదిగూడా చెప్పమంటావా"

"పార్వతీ...నాకేం అర్థం కావటంలేదు...నన్ను క్షమించలేవా... ఎక్కడా నువ్వు రాసింది చెప్పవా పారూ..."

క్షమించలేను మామయ్యా...నా పేరు పదే పదే ఉచ్చరించి కలుషితం చెయ్యకు...అయినా చెబుతానులే...చూసుకో...నీ రాతి గుండె మీద రాశాను...చేతనయితే హృదయం చీల్చుకుని చెరిపివేసుకో..." పార్వతి ఆయాసపడుతూ ముఖం పక్కకు తిప్పుకుంది. ఆమె ముఖం రంగుమారిపోయింది. నల్లబారుతోంది. గోపాలరావు బరువుగా నిట్టూర్చాడు. పార్వతి గిలగిలా తన్నుకోటం మొదలుపెట్టింది. అతను కంగారుపడుతూ గొలుసులాగుదామని దానిని చేతిలో పట్టుకోగానే బండి దానంతట అదే ఆగిపోయింది.

బయటినుంచి కిళ్లీ,టీ వాళ్లు వూరికే అరుస్తున్నారు. గోపాలరావు గబగబా కిందకుదిగి స్టేషనుమాష్టరు దగ్గరకు పరుగెత్తుకువెళ్ళి ఆయన్ని పిలుచుకువచ్చాడు. ఆయన వచ్చేటప్పుడు ఫస్టుయెయిడ్ బాక్సు పట్టుకు

వచ్చాడు. ఇద్దరు పోర్టర్లు గబగబా పెట్టెలోకి ఎక్కి పార్వతిని బలవంతంగా దించారు. కింద అప్పటికే జనం రద్దీ ఎక్కువయింది. చుట్టూరా మూగి హడావుడి చేస్తున్నారు. లలితమ్మా, సావిత్రి గూడా సామాన్లు దింపుకువచ్చారు వీరున్న చోటికి ఆ స్టేషను రామాపురం అని తెలుసుకున్నాక. జనంలోనుంచి చొచ్చుకుని పార్వతిదగ్గరకు చేరటం ప్రళయం అయిపోయింది.

పార్వతి మూలుగు ఎక్కువైంది. ఆ ధ్వని ఎక్కడో పాతాళం నుంచి వస్తున్నట్లుంది. రెండు మూడుసార్లు బలవంతాన పెదవులు కదల్చడానికి ప్రయత్నం చేసింది. ఆ వచ్చినాయన ఏదో సీసాలోనుంచి మందు చెంచాతో తీసి పెదవులు తడిపాడు. పార్వతి పెదవులు బలవంతాన కదుపుతూ 'విషం...నేనే...చచ్చి...ఊ...పుచ్చుకున్నాను' అంది. గోపాలరావు స్టేషనుమాష్టరుగారి భుజంపట్టుకుని:

'వినండి డాక్టరుగారూ...నాకేం తెలియదు...నేనేం చెయ్యలేదు' అన్నాడు. పార్వతి ముఖంలో రేఖామాత్రంగా చిరునవ్వు పొడసూపింది గోపాలరావు వంక చూస్తూ. లలితమ్మా సావిత్రి పార్వతి దగ్గరకుచేరి హోరుహోరున ఏడుపు ప్రారంభించారు. రైలుస్టేషనుఎదుగా రాలిపోయిన నక్షత్రం గోపాలం దృష్టిలో పడింది. అతని హృదయం జల్లుమంది. వక్కసారిగా వణికిపోతూ అతని రెండుచేతులూ హృదయానికి హత్తుకున్నాడు అతని చేతికేమిటో అక్షరాల్లాగా గుచ్చుకున్నాయి.



# కథలో కథానిక

మీనాక్షి చిన్నతనంలో ముద్దొస్తూవుండేది. ఇప్పుడూ అలాగేవుంది. చారెడేసి కళ్లు. ముచ్చటగొలిపే ముక్కు. ఎప్పుడూ నవ్వుతూ కన పడే చెక్కిళ్లు తీర్చి దిద్దినట్లు కనపడే కనుబొమలు.

ఈవిధంగా చెప్పుకుంటూ పోతుంటే ఎరగనివాళ్ళు నిజమే అను కుంటారు. రమణ ఎరుగుంటే గూడా అదేమాటమీద నిలబడతాడు.

ఆ అందమే మీనాక్షిని చెడగొట్టిందనీ, అందానికీ— గుణానికీ సరిపడదనీ, అతనికున్న అభిప్రాయాల్లో ఒకటి. ఆమాట ఎవరయినా కాదంటే వాడి ప్రాణాలు కొరికేస్తాడు.

సెలవుల్లో సరదాగా గడుపుదామని ఒకసారి వాళ్ళవూరు పోవటం తటస్థ పడింది.

రమణ యింటికిపోగానే వాడు అమాంతం లేచి నన్ను కౌగలిం చుకుని యింట్లోకి తీసుకుపెళ్ళాడు. వాడు ఈమధ్యనే కాపురం పెట్టాడు. అంతకంటె పెద్దకారణం ఏంలేదు అతనిలో వుత్సాహము గట్లుతెంచు కోవటానికి.

'ఏమిటిరా...విశేషాలు' అన్నాను. అదేమాట వాడు అడుగుదా మని అనుకుని వుండాలి: నేనే అడిగి వెయ్యటంతో ముఖం చిన్నబుచ్చు కొని 'ఏమున్నాయిరా ... మామూలే' అన్నాడు. 'నువ్వు వుత్తరము రాయకపోయినా, నువ్వుకాపురముపెట్టిన సంగతి తెలిసిందిలే'...అన్నాను.

ఏదయినా సమాధానం చెపుదామని ఆలోచిస్తుండగానే మీనాక్షి వంటింట్లోంచివస్తూ 'ఎప్పుడూ రావటం?' అంది.

'కనబడటంలా...' అన్నాను. రమణ ఒక చిటప్వ గాలిలోకి విసిరిపారేసి 'భలే చెప్పావురా' అన్నాడు.

'కబుర్లు బాగా నేర్చావే....అంది. చివరి అక్షరం 'వే' నా 'రా'నా అని కాసేపు ఆలోచించాను. అంతచొరవ తీసుకో గలిగినంత పరిచయం లేదు నాకు. దాన్ని ఆలోచించటం అనవసరం అనుకుని 'నిన్న చూసిన

తర్వాత కటుక్లకేమి తక్కువో అన్నాను. రమణ నవ్వబోయి మీనాక్షి చూసి ఆపుకున్నాడు.

ఆ తర్వాత రోజు పూరుబయటకు షికారుగా పోయాం. రమణ అడుగు తొక్కిపెట్టి వేస్తున్నాడు. కర్మంజాలక తెక్కమర్చిపోతే మళ్లీ ఇంటి పోతాడేమోనని నా మనసులో పీకుతూనేవుంది.

'ఏమిటి ఆలోచిస్తున్నావు?' అన్నాను అతని కాళ్లవంకచూస్తూ రమణ నాకేసిచూస్తూ "నేను కాళ్లతో ఆలోచించను" అన్నాడు అతని ధోరణిచూస్తే ఏదో భయంకరమైన విషాదగాధను బయటపెట్టడానికి సుముదుచేసే ప్రయత్నంలా కనబడింది. అటువంటి అఘాతాన్ని తట్టుకో వటానికి సన్నద్ధుడిని అవుదామని 'నువ్వు కాపురం పెట్టింది ఈ మీనాక్షి తోనేనా?' అన్నాను.

'యింకా ఏ మీనాక్షితో అనుకున్నావు?" అన్నాడు అతని మనసు లోని వేదనను బయటకు ఎట్లా లాగాలో అర్థంగాలేదు. అతని ముఖం కింది గన్నేరుపూల అంచుల్ని తీక్షణంగా చూస్తోంది.

'గన్నేరుపూలు అందగా వున్నాయని ఏవరయినా తీసి తలలో పెట్టు కుంటారా రమణా....'అన్నాను. రమణ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి అవసర మయినప్పుడు ఆడదానికంటేగూడా ఎక్కువగా కళ్ళవెంబడి నీళ్లు కార్చెయ్యగలడని నాకు తెలుసు.

'నీ మనసులో వుందేమిటో చెప్పు రమణా...అయిన స్నేహితు డిని కనక కొంత భారం నేనుగూడా వహిస్తాను' అన్నాను.

'గన్నేరుపువ్వు అందరి కాళ్ళకిందాపడి నలిగిపోతుంటేచూసి వూరు కోలేక తల్లో పెట్టుకున్నాను'. చివరి మాటలు సరిగ్గా వుచ్చరించలేక పోయాడు. 'గోపీ...' అంటూ నాబుజం పట్టుకుని, నడుస్తున్న కాలవ గట్టుమీద కూలిపోయాడు.

ఎండిపోయిన కాలవలో దొరువులు అక్కడక్కడా కనపడు తున్నాయి. కప్పలకదే స్వర్గంలా వుంచి వుండాలి. ఆముదుగులోనుంచే శ్రావ్యంగా గానంచేస్తున్నాయి.

'చూడు రమణా...ఆ కప్పలకు సుఖంగా వుందంటావా...లేదం టావా?' అని అడిగాను.

నావైపు తలఎత్తి చూసి మళ్ళీ తల వంచేశాడు. 'నీమనసులో వున్నదంతా చెప్పేశెయ్...తర్వాత నేను వుపాయం చెప్తాను...ఈలో పుగా నీకు శాంతి చేకూరుతుంది అన్నాను.'

అయితే మొదటినుంచీ చెపుతాను విను...మీనాక్షి అందంగురించి నీకు నేను చెప్పేదేమున్నది గోపీ...చదువు అయేటంతవరకూ నువ్వా యిక్కడే వున్నావుగా! నాకు ఆడవాళ్లంటే మహాచెడ్డ అసహ్యం. వాళ్ళ మూలానే ఈప్రపంచమంతా పాడయిపోయిందని గట్టిగా నమ్మేవాళ్ళల్లో నేనూ వకణ్ణి....నీకూ తెలుసుగా....!'

నవ్వు వచ్చింది నాకు. ప్రపంచం తలక్రిందులయినా పెళ్ళిచేసు కోనని, వాడు బి.ఏ. క్లాసులో సలుగు వయిదుగురికి వినబడేటట్లు చేసిన ప్రతిజ్ఞ గుర్తుకు వచ్చింది.

'అవును...కానియ్, మధ్యలో ఆపక' అన్నాను. రమణ ప్రారం భించాడు తిరిగి.

'మీనాక్షిని చూసినా అదే అభిప్రాయం వుండేది. ఆమె గుణంలో నాకు నమ్మకంవుంది. ఆమె అందంలో నాకునమ్మకం లేదు. ఆ అందమే ఆమెను పతితురాల్ని చేసింది. నువ్వు బి.యే. పూర్తిచేసుకుని యింటికి పోగానే ఇక్కడ పుట్టిన వదంతుల్ని వయసాగ్గా రాస్తే పది కాగితాలు సరిపోవు

'ఒక రోజు సాయంత్రం ఇలాగే షికారువచ్చాను. మాస్నేహితుడు ఒకడు కనపడి 'ఏంరోయి...మీనాక్షీ మీ పాలేరుని పెళ్ళిచేసుకుంటుంద టగా' అన్నాడు. నాకు చర్రున కోపంవచ్చింది. ఆకోపంలో వాడిని కొట్టాను. కాని, తొందరపడ్డానేమోనని తర్వాత అనిపించింది. మీనాక్షి ఎంత అనాధ అయినా గుణవంతురాలనే నాకు యిప్పటికీ నమ్మకం.

'అదేరోజు యింటికి తిరిగి వస్తుంటే మా పాలేరు కనపడ్డాడు. వాడు నావంక చూస్తూ 'ఏం దొరా...మీ శంకరం దొరగారు మీనాక్షమ్మ గారిని పెళ్లిచేసి కొంటారుటగా' అన్నాడు. ఇంతకు మునుపు నాచేతుల్లో దెబ్బలుతిన్న శంకరం...నమ్మలేకపోయాను. నాకు నాచేతి దురద తీర చేసు. పాలేరు దవడ వాచేటట్లు కొట్టాను. నన్ను తిరిగి కొట్టగలిగిన

బలమున్నా. వాడబ్బ బలాన్నిచూసి బెదిరిపోయాడు. వాడు తిరగబడి నన్ను కొట్టినా నాకు మనశ్శాంతి లభించేదే! నన్నుచూసి నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు. ఆనవ్వుతున్న కళ్ళు రెండూ నన్నింతవరకూ వెంటాడు తునే వున్నాయి...

రమణ రుమాలుతీసి ముఖం తుడుచుకున్నాడు. సినిమా లో ఇంటర్వల్‌కు లేచినట్లయింది నాకు. 'అమ్మయ్య' అని నిట్టూర్చాను. రమణ చెప్పుతూనాన్నాడు మళ్ళీ.

'ఒకేవక విషయం చెప్పాను గోపీ,నీకు... యిటువంటి సంఘట నలు ఎన్ని జరిగాయో చెప్పలేను. ఆమె అందంకోసం,చిరునవ్వు ముఖం కోసం వాచిపోయినట్లు ఆసందులో తిరుగుతుండేవాళ్ళు. మీనాక్షి బల వంతం మీదట, ఒకసారి శంకరంతో సినిమాకి పోయింది. సినిమా నుంచి తిరిగి వస్తుంటే చూశాను. మీనాక్షి ఎడంచేతివేళ్ళు శంకరం చేతిలో దాక్కున్నాయి. నేను మసక వెలుతురులో స్పష్టంగా చూడగలి గాను. శంకరం కనక ఆమెను పెళ్ళిచేసుకుని, వీధిలో ఎత్తుకు తిరుగు తున్నా చూసి ఆనందించే వాడినే! నన్ను చూసి వాళ్ళిద్దరూ దూరంగా వెళ్ళారు. సినిమా సంగతి మాట్లాడుకుంటున్నారని నాకు తెలియాలని, బిగ్గరగా సినిమా కథ చెప్పుతున్నాడు శంకరం. వెనక్కు తిరిగి యింటికి వచ్చేశాను.

'ఆనాటినుంచి ఆమె అనేక మందితో కలిసి తిరగటం స్వయంగా చూశాను. నా నెత్తురు వుడికిపోయింది. నా జీవితంలో చిరకాలం నిలిచే పని ఏదీ చేయలేకపోయినా, పుట్టిన వూళ్ళో జరుగుతున్న ఘోరాన్ని అరికట్టలేక పోతే నా జీవితం ఎందుకా అనిపించింది.

'గబగబా చొక్కాలాగూ వేసుకుని బయలుదేరాను. సూటిగా మీనాక్షితో పాటు--చంద్రియ్య మంచంమీద కూర్చుని కనపడ్డాడు. అతని చేతిలో రూపాయినోట్లు గుప్పెడు వున్నాయి. ఏమిటో బ్రతిమలాడు తున్నాడు. అంతా నేను తలుపులోనుంచి చూశాను. తలుపు పగిలిపోయే టట్లు బాదకుండా వుండలేక పోయాను. మీనాక్షి తలుపుతీసింది.చంద్రయ్య దొడ్డిదారి గుండా పారిపోయాడు...

'గోపీ...అటువంటి సమయంలో మీనాక్షిన్నువ్వే కనక చూసి వుండేటట్లయితే చంపి పారేసేవాడివే...నేను లోపలికిపోగానే మీనాక్షి కనబడలేదు. ఆమె కళ్ళుకనబడ్డాయి. కళ్లనవ్వటం ఎప్పుడన్నా చూశావా గోపీ? నాకూ అదే మొదటిసారి. భరించలేక పోయాను. ఆమె పాదాలు పట్టుకొని నా హృదయంలో నీళ్లన్నీ కారిపోయేటంతవరకూ ఏడుద్దా మని పించింది.

'మీనాక్షి నా కళ్లవెంబడి కారుతున్న నీళ్లను చూచింది. పరుగెత్తు కుంటూ దగ్గరకువచ్చి, కొంగుతో కన్నీరు తుడిచి 'ఏమండీ రమణ గారు! కొత్తగా ఆడవాళ్ళయిపోయారు' అంది. మహా సిగ్గువచ్చింది గోపీ....ఏమీలేదంటూ చేత్తోనే కళ్ళు తుడుచుకుని 'మాట్లాడదా మని వచ్చాను' అన్నాను.

'తప్పకుండాను...నేనూ అటువంటి సమయం కోసమే ఎదురు చూస్తున్నా' నంది. "నామాట అర్థం చేసుకోలేదు అనుకున్నాను.

'మాట్లాడండి...' అంది మీనాక్షి.

'అంత తేలిగ్గా తోసిపారేశేటట్లయితే నేనేమీ చెప్పను.... వచ్చిన వాడిని వచ్చినట్లు వెళ్ళిపోతాను' అన్నాను. నాదైన్యాన్నిచూసి మీనాక్షి ఆశ్చర్యపోయింది. నా సోదంతా చెప్పాను. నాలో మండుతున్న పశ్చాత్తాప యాగ్ని చల్లార్చడానికి ఆమె కన్నీరు కావాలని అన్నాను.

'అంతే?' అంది మీనాక్షి.

'ఆమె చేతుల్ని నాచేతుల్లోకి తీసుకున్నాను. ఆమె చెక్కిళ్లు తళ తళ లాడుతున్నాయి. మెల్లగా స్పృశించాను.చెక్కిళ్ళలోపలనీళ్ళు వున్నట్లు తోచింది. నాచేతి కర్కశత్వానికి ఆమె చెక్కిళ్లు చిరిగి నీళ్ళుకారి పోతా యేమో అనిపించింది నాకు.

'మీనాక్షి.. నీ జీవితం నాశనంచేసికోకు...నీవు అనాథవయినా కులంలేని దానివయినా, నాకేం భయంలేదు...నాకు మటుకు ఏం కుల ముంది? వాటినన్నీ వదలిపెట్టేశాను. కత్తిదూసి కంఠరాలు పడనుపెట్టే స్థితిలో లేదు. వ్యాపారం చేసి లాభాలు గడించే తెలివి తేటలులేవు. కనీసం వ్యవసాయం చేసుకుని జీవించటాని కయినా, పొలేరు సాయం

లేనిదే కాలుబయట పెట్టలేను. నాకేం కులముంది. మీనాక్షీ....చెప్పవూ ...నన్ను పెళ్లిచేసికో...గృహస్థ జీవితంలోవున్న స్వారస్యాన్ని రుచి చూడు...నీ జీవితం కలుషితం అయిందని భయపడకు...నేను క్షమించ గలను అన్నాను.

'నాజీవితం కలుషితం కాలేదు' అంది మీనాక్షి. నాకు నమ్మకం కుదరలేదు. నేను నమ్మలేదు. నేను క్షమించగలననే ధైర్యం కలిగింది. అందుకనే పెళ్ళిచేసుకున్నాను' అన్నాడు రమణ.

నా మనస్సు వికలమైపోయింది. రమణ చెప్పిన విషయాలు నిజం గానే తోచినాయి. అతను చేసిన త్యాగం విలువ కట్టగలిగినవాళ్లు గూడా లేని ఈరోజుల్లో దాని, విలువ 'ఇంత' అని చెప్పితే ఎంతమంది అర్థం చేసుకుంటారు?

'నువ్వు చేసినపని మహోన్నతమైంది. రమణా .... అందుకని నువ్వు విచారపడాల్సిన పనిలేదు...'

రమణ గట్టుమీద గడ్డిని గట్టిగా చేతితో పెరికి 'అందుకుగాదు గోపీ నా ఆవేదన...కుక్కను బంగారపు సింహాసనంమీద కూర్చోపెట్టినా చెప్పులే కావాలంటుంది...మీనాక్షిలో ఆకుక్క బుద్ధి నశించలేదు.నాప్రేమ ఆమె కాలుష్యాన్ని కడిగి వేయలేక పోయింది.ఈనాటికీ ఆమె స్వతంత్రం కావాలంటుంది. స్త్రీకి స్వాతంత్రం కావాలంటే అర్థంచేసుకుంటాగాని, ఆ స్వాతంత్రం పరాయి పురుషునితో షికారుకుపోయే టంతవరకూ కావాలంటే నేను సహించలేను. ఆమె మనస్సు ఇంతవరకు కలుషితం గానే వుంది. నాబాధ నీకేం అర్థం అవుతుంది గోపీ?' అంటూ నిట్టూర్చాడు.

ఆడది అంటే అభిప్రాయాలు లేకపోయినా భయంమాత్రంపోలేదు ఈ నాటికీ. ఆమె మనసు ఏక్షణంలో ఎటువైపు పాదరసంలాగున ప్రవ హించి పోతుందో తెలియదు. మీనాక్షిమీద గౌరవంలేదు గాని అపేక్ష కావలసినంత వుంది. ఆ సొట్టపడే బుగ్గలు ఎప్పుడూ నవ్విస్తూనే వుం టాయి... ఎవ్వరూ దగ్గరలేనప్పుడు గూడా ఆమె నవ్వుతున్నట్లే కనపడు తుంది. దేవుడిచ్చిన వరాన్ని కాలదన్నుకోవటం మానవ మాత్రుడికి

ఏమాత్రం సాధ్యమవుతుంది? ఈకాస్త తర్కం రమణ అర్థంచేసుకో లేకపోయాడా అనిపించింది.

మీనాక్షిని ఒకసారి చూసింతర్వాత మళ్ళీ వస్తాడు చూసేటంత వరకూ మనసు తపనపడిపోయేది చదువుకునే రోజుల్లో. బ్రహ్మదేవుడు కిందకు దిగివచ్చినా వేమన చెప్పినమాట నిజమేనని రుజువు అవుతుంది గాని ఎవరికీ ఆశ్చర్యాన్ని కలిగించదు.

'సాఫీగా సాగిపోయే నీ జీవితంలోకి ఈ నిప్పుల కుంపటిని ఎందుకు తెచ్చుకున్నావురా?' అని అడిగాను. రమణకు నిజంగానే కోపం వచ్చింది.

'మీనాక్షి నీ కల్లాకనపడుతోందా?' ఎదురు ప్రశ్నవేశాడు. రమణ మీనాక్షిని ప్రేమిస్తున్నాడు. ఆమెలోని 'అతను చెప్పుకునే' దుర్గుణాన్ని ద్వేషిస్తున్నాడు.

'ఇంటికి పోదాం పద...యివ్వాల్టికి యిది చాల్లే' అన్నాను.

రమణ నాతోపాటు మౌనంగా నడుస్తూ వచ్చాడు. నా ఆలోచనంతా మీనాక్షిమీద కేంద్రీకరించబడి వుంది. ఇంటికి రాగానే నన్ను ఏకవచనంలో పిలిచినప్పుడే నాకు వెగటుగాతోచింది.

రమణ ఎందుకు నవ్వి వూరుకున్నాడో నాకు ఎంత మాత్రంఅర్థం కాలేదు.

'మీనాక్షి విషయం నువ్వేం...విచారించకు...ఆ విషయం నేను చూస్తాను' అన్నాను చాలా ధీమాగా. రమణ నవ్వాడు. ఆనవ్వుచూస్తే నాకు భయంవేసింది.నాకు జరగబోయే అవమానానికి నాందిగాతోచింది;-

'నువ్వు యింటికిపోరా ... నేనిప్పుడే బజారుమీదుగా వస్తాను' అన్నాడు రమణ. నేను మాట్లాడకుండా యింటికి వచ్చేశాను.

రమణ చెప్పిన 'ఇప్పుడే' గడిచి పోయింది. దాని తర్వాత రెండు గంటలు గూడా గడిచిపోయాయి. నేను వాకిట్లో అరుగుమీదనే కూర్చుని వుండవలసి వచ్చింది. మీనాక్షి ఎక్కడకువెళ్ళిందో తెలియదు. బాగా చీకటి పడిపోయిన తర్వాత వచ్చింది.

'ఎంత సేపటి నుంచి [illegible]'

'ఇప్పుడే వచ్చాను' అన్నాను. వెంటనే అందుకుంది మీనాక్షి 'నేనూ ఇప్పుడే బయటకు వెళ్ళాను...ఈలోపున మీరు వచ్చివుంటారు' అంది. 'ఇప్పుడే' అనే మాటకు ఆవూళ్ళో అర్థంలేదనుకున్నాను. భర్త సమక్షంలో ఏకవచనంలో పలకరించిన మీనాక్షి ఒంటరిగా వున్నపుడు గౌరవంగా మాట్లాడటం ఆశ్చర్యం కలిగింది. రమణ మనసు నొప్పించటమే అసలు వుద్దేశమేమో అనిపించింది.

మీనాక్షి తలుపుతీసి 'రండి లోపలికి మీస్నేహితుడు ఏడీ' అంది. ఆమాటలో ఎంతో గూఢార్థం వున్నట్లనిపించింది. 'రమణ మీకేమేం చెప్పాడో నాకన్నీ తెలుసులే' అన్నట్లు ధ్వనించింది. సమాధానం చెప్పకుండా లోపలకు పోయి కుర్చీలో కూర్చున్నాను. ఫ్లాస్కులో కాఫీ రెండు కప్పుల్లోకి పోసి టేబిలుమీద పెట్టింది.

'సిగరెట్లు కావాలంటే అవిగూడా వున్నాయి'అంది. సిగరెట్లు కాల్చటం చేతకానందుకు చాలా చిన్నతనం వేసింది.మీనాక్షి నవ్వుకుంటూ నా ఎదురుగావున్న కుర్చీలో కూర్చుని కాఫీ అందుకుంది.

'మిమ్మల్ని చూసి చాలాకాలంఅయింది' అన్నాను ఏదో ఒకటి మొదలుపెట్టాలని.

'అవును మరి...ఆరోజుల్లో ఒకరి నొకరు చూసుకోవటమే గాని మాట్లాడుకునేటంత చొరవ ఎక్కడిదీ'అంది. కాఫీపొగలు కక్కుతోంది.

"మీ పరివర్తన ఏం బాగా లేదు" అన్నాను చాలా కఠినంగా నాలోవున్న కోపాన్నంతటినీ గొంతులోకి తెచ్చుకుని.

'బాగు చేద్దామని వచ్చారా....' అని మీనాక్షి నవ్వింది.

'ఎవరూ ఎవరినీ బాగుచెయ్యలేరని నావుద్దేశం. వున్న విషయాన్ని మీకర్థమయేటట్లు నచ్చచెప్పటమే నావుద్దేశం...'అన్నాను.

'మీకు పెళ్ళయిందా?' మీనాక్షి కటువుగా అడిగింది. కాలేదంటూ తల అడ్డంగా వూపాను. నేను అబద్ధంచెప్పినట్లు ఆమె తెలుసుకుందని తర్వాత గాని నాకు తెలియలేదు.

'పెళ్ళి గూడా కానివాళ్ళు ఆడవాళ్ల గురించి అభిప్రాయాలు ఏర్పరుచుకోవటానికి మీకేం అధికారంవుంది' మీనాక్షి ప్రశ్న సబబైన ప్రశ్న. నాకు పెళ్లయిందని చెప్పటం ఇష్టంలేకపోయింది.

మీనాక్షి ఈ మానవులకే అపురూపమయిన వస్తువుగా తోచింది.

'మామూలు ఆడవాళ్ల సంగతి తెలిసినవాళ్ళకి గూడా, మీగురించి మాట్లాడే హక్కులేదు...అయినా నాకున్న పూర్వ పరిచయంమీద ధైర్యంచేశాను...మీకు రమణ అంటే అంత నిర్లక్ష్యం ఎందుకనో చెప్పండి...ఈ సంభాషణ ఎవరికీ తెలియనీయనని హామీయిస్తాను' అన్నాను.

'విచ్చిన గులాబి పువ్వు నలుగురూచూసి ఆనందించటానికా?.... ఎవరి జేబులోనో పడి అనామకంగా నాశనంఅయి పోవటానికా?... ఈమాటకు జవాబు చెప్పండి' అంది. 'పూలకీ మనుష్యులకీపోలికలేదు... మీరు చెప్పేది చాలా అసందర్భంగావుంది.' అన్నాను.

'సందర్భంగానే వుంది...భగవంతుడునాకు ప్రసాదించిన ఈఅపురూపమైన సౌందర్యాన్ని వంటింటి పొగలో మాడ్చివేస్తే దేవుడు నామీద కోపగించడూ?' నాగుండె నోట్లోకి వచ్చినట్లయింది. మనుష్యుల సంగతి మాట్లాడుతూ దేవుడితో విషయాన్ని ముడిపెట్టటం ఒక్క మీనాక్షికే చేతనవునేమో అనిపించిది.

'అందుకని ఆకులమధ్య వుండాల్సిన పువ్వుని తీసికెళ్లి-తర్వాత ఏం చెప్పాలో చేతకాలేదు.

పోల్చిన ఉపమానాన్ని ఎంతదూరం తీసికెళ్ళి విడిచిపెట్టాలో కుదరలేదు.

'చెప్పండి...' అంది మీనాక్షి.

'అవన్నీ నాకు తెలియవు...పువ్వుకు సువాసన వుంది గనకనే రాణిస్తోంది... గుణంలేని అందం గూడా గడ్డి పువ్వు మాదిరి నిరర్థకమే అవుతుంది' అన్నాను.

'పువ్వును నలుగురూ వాసన చూస్తూవుంటే కాదని అదేం చెప్పగలుగుతుంది' అంది మీనాక్షి.

'పువ్వుకు రాకపోయినా మనుష్యులకి మాటలు వచ్చుగదా' అన్నాను.

మీనాక్షి నవ్వింది. నాకు చాలా విచారము కలిగింది. 'నా సంగతి చెప్తాను. ఓపిగ్గా వింటారా' అంది మీనాక్షి. తల నిలువుగా వూపాను.

'నేను కాలేజీలో చదివే రోజుల్లో అంతా నాదర్శనం కోసం ఎలా తల్లడిల్లి పోయేవారో మీకు గూడా తెలుసుననుకుంటాను, అదంతా నన్ను చూచిగాదు...నా అందాన్ని చూచి, ఆ సంగతి నాకు తెలుసు. నాకు గుణం లేదనే కంటే వున్నదని విచారపడే వాళ్లే ఎక్కువగా వున్నారు ఇప్పటికి గూడా...

'మీ స్నేహితుడయినా నా అందాన్ని చూసి చేరదీశాడే గాని నా గుణాన్ని చూసిగాదు. నాలో శీలం నశించిపోయిందని వూహించిన తర్వాత శీలంగల వాడెవడయినా నాదరి జేరుతాడా....? అందరితో పాటే మీ స్నేహితుడు నా అందం వలలో చిక్కుకుపోయాడు. వదిలించుకోలేక పోయాడు. వదిలించుకోవాలని ఎన్నడూ కోరుకోలేదేమో గూడా...!

'ఆ వలలో తనొక్కడే నివసించాలని అతని ఆలోచన. అంత సంకుచితమైనది గాదు నా మనసు. నా హృదయంలో అందరికీ స్థానం వుంది. నలిపి పారేసిన పూవులాగా హరించుకు పోవటం నా జన్మలక్ష్యం గాదు. నా నీడలో సేదదీర్చుకొనే వారందరికీ కల్పవృక్షాన్ని నేను. నా గులాబికి ముళ్ళున్నాయి గోపీనాథ్ గారూ! దూరంగా వుండి ఆనందించే వాళ్ళేగాని చెయ్యివేసే ధైర్యం ఎవరికీ లేదు ముళ్ళు గుచ్చుకుంటాయని మీకీ పాటికి తెలిసే వుండాలి. ఈనాడు నా మనస్సును కలుషితం చేసుకోటానికి సిద్ధపడితే, లక్షల రూపాయయలు కుమ్మరించటానికి సిద్ధంగా వున్నారు. రమణ సంగతి మీకంటే నాకు ఎక్కువగా తెలుసు, మీతో నామీద నేరాలు నూరిపోసి వుంటాడు. ఆ వుద్రేకంలో నన్నొచ్చి బాగు చేద్దామనుకున్నారు. మీకు వివేకం తక్కువ ... విచక్షణ జ్ఞానం శూన్యం...' మీనాక్షి గుక్క తిప్పుకోకుండా మాట్లాడుతోంది. అంత వేగంగా వినలేకపోయాను. ఆగమని చెప్పే సావకాశం దొరకలేదు.

ఎవరిని బాగుచెయ్యాలన్న ఆలోచన కలిగింది. ఇద్దరిలో ఎవరూ చెడిపోలేదేమోనని నాకు గట్టినమ్మకం కుదురుతోంది. వారిలో వుద్రేకం పెడదారి తొక్కి, గట్టు వదిలి కంచెలమీద నడుస్తోంది. ముందర రమణకు నచ్చచెప్ప గలిగితే, సమస్య తీరుతుందనే అభిప్రాయము కలిగింది.

ఒక్కసారిగా కిటికీలోనుంచి గాలి రంయిమంటూ వీచింది చల్లగావుంది. బయట మబ్బులు పరుగెత్తుతున్న చప్పుడువినబడుతోంది. వానవస్తుందేమో అనిపించింది. బయట వానకురుస్తుందేమో అనిపించింది. బయట వానకురుస్తున్నప్పుడు, లోపల స్నేహితుని భార్యతో జీవితపు లోతులనుగురించి తర్కించటం బాగా లేదని అనిపించింది.

గబుక్కున వచ్చినగాలికి లెక్ట్రైటు ఆరిపోయింది. మీనాక్షి లేచి వెలిగించి వచ్చి కూర్చుంది.

నేను ఆమె వంకనే నిర్ఘాంతపోయి చూస్తున్నాను.ఆమె గమనించి వుండాలి. నాదగ్గరగావచ్చి భుజంమీద చెయ్యివేసి, 'కోపంవచ్చిందా' అంది. వళ్లు జలదరించింది. వులిక్కి పడ్డాను. 'భలేవారండీ' అంది నవ్వుతూ.

ఆమె పెద్ద పెద్ద కళ్ళు,తీర్చిన కనుబొమలు, చిరిపినోరు, సొట్టలు పడిన చెక్కిళ్లు, అవే కనపడుతున్నాయి. కంగారుగా తోచింది. అంత అందమైన విగ్రహం ధరిత్రిమీద వుండటం తగదేమో అనిపించింది. తొందరపడి అయిన సంబంధాన్ని చేసుకున్నందుకు ఆక్షణంలో ఎంతో అసహ్యం వేసింది.

'కాఫీ తాగుదురుగాని రండి...మంచి మంచి ఆలోచనలు వస్తాయి' అంటూ నా చెయ్యిపట్టుకుని వంటింట్లోకి నడిచింది. కిటికీరెక్కలు నాగుండెకంటే వేగంగా కొట్టుకుంటున్నాయి. ఆమె రెండుచేతులూ నాచేయిని పట్టుకుని వంటింట్లోకి నడిపిస్తున్నాయి.

'మీనాక్షీ....ఎంత అందంగా వున్నావు' అన్నాను.ఆమె నవ్వుతూ నాకు మరింత సన్నిహితంగా వచ్చింది. ఆమె నాకౌగిలిలో అణిగి పోయింది. ఆమెతల నాహృదయానికి తగిలింది. ఆమె కన్నీరు కారుస్తోంది

మొదట నాకు కనపడలేదు .ఆమె నాలో లీనమయిందనిపించింది. నేవచ్చిన పని జ్ఞాపకంవచ్చింది. ఆమెను పక్కతోపుతోసి చాచి చెంప మీద కొట్టాను' అప్పుడు తగిలినాయి ఆమెకన్నీళ్లు నాచేతికి.

'పాతకీ!...కట్టుకున్న మొగుడికి యింత అన్యాయంచేస్తావా... ఛీ...' అంటూ ఆమెను వక్కతోపు తోశాను.ఆమెచెంప కందిపోయింది. నవ్వుతున్న చెక్కిలి కోపంతో, నా వేపు కళ్లెర్రచేసి చూస్తోంది.

గబుక్కున బెడ్‌లైటు పైన గోడకున్న మసితీసి ఆమె ముఖమంతా పులిమాను.

'పాపిష్టిదానా...నీ అందమే నిన్ను పాడుచేసింది...ఈ మసిపూసిన మారేడు కాయను అద్దంలో చూసుకో...సిగ్గులేదూ .... ఫో' అంటూ అరిచాను.

మీనాక్షి తేరుకున్నట్లు కనిపించింది.

'నేను దగ్గరకు తీసుకున్నప్పుడు నువ్వు కొడతావని వూహించాను ...నీదుర్బలతను చూసి సహించలేక నేనే ఆపని చేయాల్సి వచ్చింది' అన్నాను.

రమణ అమాంతం వూడిపడ్డాడు గదిలోకి. మీనాక్షి కనక అడ్డు పడక పోతే నన్ను గట్టిగా బాదేశేవాడే.

'తమాషాకి చెప్పిన మాటమీద....యింత తొందరపడతావనుకో లేదు గోపీ' అన్నాడు రమణ.మీనాక్షి గబగబా దొడ్డిలోకి వెళ్ళిపోయింది. నాతల తిరిగి పోయింది! 'మీకు ముఖం చూపించలేను. రమణా మళ్లీ ఎప్పుడన్నా కనిపిస్తా' అంటూ ముఖానికి చేతులడ్డం పెట్టుకుని వీధిలోకి పరుగెత్తుకొంటూ వచ్చేశాను...మీనాక్షిని వకసారి చూద్దామని అనిపించిందిగాని, ధైర్యం చాలక పరుగెత్తుకుంటూ స్టేషను పైపు వెళ్లాను.



# విశాల హృదయం

వాకిట్లో వేపచెట్టు క్రింద నులక మంచం వేసుకుని పేపరు చూసుకుంటూ కూర్చున్నాడు, గోపాలరావు. రైలు పెట్టెల్లో రకరకాల మనుష్యులు కలిసినట్లే పేపర్లో ఎక్కడెక్కడి విషయాలో సంబంధం లేక పోయినా వకదాని పక్క వకటి కూర్చివుంటాయి. గోపాలరావుకి పేపరు చూస్తుంటే సినిమా చూస్తున్నట్లు వుంది.

రైలు కిందపడి ఎవరో ఆత్మ హత్య చేసుకున్నారుట. పాపం: ఇంట్లో ఈగల మోత వుండి వుంటుంది. బయట అప్పుల వాళ్ళ అరుపులు వినబడి వుంటాయి. పెళ్లానికి పురిటి రోజులు. చంటివాడికి చలిజ్వరం. యింట్లో ముసలమ్మకు రోజులు నిండుకుంటున్నాయి. బియ్యం డబ్బా ఖాళీ అయింది. దుకాణంలో అరువు యివ్వనన్నాడు. అంతకంటే ఏం కావాలి. రైలుకింద ఎందుకు పడ్డాడో. బహుశా పురి పెట్టుకోవడానికి సరిపోయేతాడు యింట్లో లేదేమో:....

చెత్త కుండీలో పసి పిల్లవాడు దొరికిన వైనం, అభాగ్యురాలు ఎవరో, పసి పాపను పోషించుకునే తాహతు లేదేమో: పేదరికం మన దేశాన్ని పీల్చి పిప్పి చేస్తోంది. ఆమెకే కనక పది ఎకరాల మాగాణీ భూమివుండి, ఆమె భర్తకే గనక రెండు వందల రూపాయలు సంపాదించే వుద్యోగమే వుండి వుంటే యింత ఘోరం జరిగేది గాదు. అయినా పిల్లలు లేని తల్లులు ఈ భూమిమీద యింత మంది తల్లడిలుతుంటే ఆ పసి కందును ఏ ఆసుపత్రిలో నన్నా యిచ్చేస్తే ఎంత బాగుండేది?... యింకొక విషయం గూడా అయివుంటుంది పేదతనం వల్ల అనుకోటానికి తగినంత ఆధారం కనపడదు. గొప్పవాళ్ళ యిళ్ళల్లో జరిగే ఘోరాల ఫలితమేమో! ఆ మధ్య ఫస్టు క్లాసు పెట్టెలో నుంచి దిండు లాంటి వస్తువు రైలు పోతుండగా కింద పడిపోతే గొలుసు లాగి కిందకు దిగి చూశారు రైల్వే గార్డు మొదలయిన వాళ్లు. పీక పిసికేసి ఎవరో మహాతల్లి పసి కందును గుడ్డలో చుట్టి విసిరేసిందని తెలిసింది. అది ఆమె అభిమానం తాలూకు పరిణామమట. గార్డు చేతిలో వంద

డూపాయల నోటుపెట్టి తన ప్రతిష్ఠ కాపాడు కుందిట. ప్రతిష్ఠ బయట వాళ్ళ కాపాడేదా. ఎవరికి వారు కాపాడుకో వలసిందా? ఏమిటో ఈ ప్రపంచం వినాశానికి బయలుదేరి పోతోంది.

ఒక సామ్యవాద సిద్ధాంతి ఆవేశంలో పని మనిషిని చావ కొట్టి, ఉద్రేకం చల్లారిన తర్వాత తీరికగా జైల్లో మకాం పెట్టాడుట: యిదీ బాగానేవుంది. చెప్పే పన్నీ చెయ్యాలని ఎక్కడవుంది? చెయ్య గలిగిన విషయాలన్నీ మళ్ళీ చెప్పటమెందుకు. పని మనుషులు గూడా నిజంగా మనుష్యులేననీ, వాళ్ళకోగూడా రక్తం మాంసాలుంటాయని ఆయన ప్లాటుఫారం మీద వకసారి బల్ల విరగ్గొట్టాడుట. రక్త మాం సాలు వుండవని ఎవరు అనుకుంటారు గనక. ఎవరో యికిలిస్తే ఆయన గారు ఆయాసపడి కూచున్నారుట...

గోపాలరావు పేపరు పేజీ తిప్పాడు. ఎవరో అడుక్కు తినే వాడు గేటు గొళ్ళెం తీసుకుని లోపలకు ప్రవేశించి, స్తంభాని కానుకుని చేతిలోవున్న డబ్బాను నిర్లక్ష్యంగా ముందుకుచాచి "మిమ్మల్నే" అన్నట్టు గోపాలరావు వంక వురిమి చూశాడు. గోపాలరావు కొద్దిగా జంకాడు తనింట్లో వక్కడే వున్నాడు గదా అని. వచ్చినవాడు చూస్తే కండలుతేలి, నరాలు ఇనప తీగెల్లాగా బయటికే కనపడు తున్నాయి. తనంటే చొక్కా వేసుకున్నాడు కాబట్టి సరిపోయింది గాని ఎవరయినా సరే, ఆవలించక పోయినా పేగులెన్ని ఉన్నాయో అతి సులభంగా లెక్క పెట్టగల స్థితిలో వుంటాడు.

"ఏయ్...అట్లా చూస్తావెందుకు...." అన్నాడు.

"ఇంకా ఎట్లాచూడాలి?"అన్నట్లు ముఖం పెట్టాడు ఆగంతకుడు.

"మొద్దులాగా వున్నావు...ఏదయినా పని చేసుకోరాదూ...." అందరు పెద్ద మనుష్యులు అడిగే ప్రశ్నే అడిగాడు.

"ఏం...ఎందుకు చేసుకోవాలి...." అన్నాడు అడుక్కు తినే వాడు. వాడి కులం అది. అంతే...గోపాలరావు కాలరు సర్దుకున్నాడు.

"పని చేసుకోకపోతే ఎట్లా గడుస్తుంది."

'తమరికి గడవటంలా —'

గోపాలరావు యింట్లో యినప్పెట్టె, బ్యాంకు ఎకౌంటు, చెక్కు పుస్తకం అన్నీ గుర్తుకు వచ్చాయి.

"రెండు రూపాయ లివ్వండి....మళ్ళీ నేను వెళ్ళాలి" అన్నాడు అడుక్కు తినేవాడు. గోపాలరావు గుండె నోట్లోకి వచ్చింది.

"ఈ కాని తీసుకునిపో...." జేబులో నుంచి కానీ తీసి గిరాటు వేశాడు. ఆగంతకుడు పడిపోయిన కానివంక చూడనేలేదు. చొక్కా పైకెత్తి బొడ్డులోనుంచి చాకు తీశాడు.

"పైస లిప్పించండి...పోవాలి...." అన్నాడు. గోపాలరావు తంగారుగా పర్సు తీశాడు. అయిదు రూపాయల నోటు మాత్రంవుంది.

"చిల్లరలేదు...." అన్నాడు. గొంతుక ఆర్చుకొని పోయింది.

"ఫరవాలేదు...." అన్నాడు ఆగంతుకుడు చాకును బొడ్డులో దోపుకుని అయిదు రూపాయల నోటు అందుకుని "జాగ్రత్త" అన్నట్టు చూస్తూ వెళ్ళిపోయాడు.

గోపాలరావు ప్రాణం నీళ్ళు కారి పోయింది. పోలీసులకి రిపోర్టు యిద్దా మనుకున్నాడు. ఖూనీ ఎందుకయిందో, ఎలా అయిందో ఆరా తీయగలరుగాని, అసలు హత్య జరగకుండా ఎట్లా, ఎంత కాల మని కాపాడ గలరు? ప్రాణం మీద తీపి, అయిదు రూపాయల కాగితం, తన అభిమానం మీద వుండే తీపి కంటె ఎక్కువగా తోచింది. కళ్ళు తుడుచుకొని పేపరు మళ్ళీ చూడటం మొదలు పెట్టాడు.

పట్టపగలు దొంగతనం....యింటి యజమానికి గాయాలు... గోపాలరావు మనస్సు చివుక్కుమంది. పేజీలు తిప్పేశాడు. అన్ని చోట్లా యిటువంటి అన్యాయాలు జరుగుతూ వుంటాయన్నమాట. అరి కట్టడం ఎలాగూ అని. ఇందాక వచ్చినవాడికి తన మాగాణీ పొలంలో సగ భాగం యిచ్చేసి వ్యవసాయం చేసుకోమంటే తనింటికి కత్తి తీసుకుని వచ్చేవాడేనా! అయినా ఎంతమందికి యిలా భాగం పంచి యిచ్చి తను బికారి కాగలుగుతాడు.

ఈ సారి యింకొకడు వచ్చాడు. అస్థిపంజరం నడిచి వస్తున్నట్లుంది. గేటు అవతలనుంచే అరుస్తున్నాడు. గోపాలరావు యిందాక

గిరవాటు వేసిన కానీ వెతికి వాడికి తీసుకుపోయి యిచ్చాడు. వాడికి కానీ వద్దుట. తింటానికి ఏదన్నా కావాలంటున్నాడు. చలివేస్తున్నది కాబట్టి పాత చొక్కా ఏదన్నా యిప్పించమన్నాడు. కానీ కంటే యింకా ఏమీ యివ్వదలుచుకో లేదని ఖచ్చితంగా చెప్పేశాడు గోపాలరావు. వచ్చినవాడు అన్నం పెట్టకపోతే అక్కడే చచ్చిపోతానన్నాడు. గోపాలరావు విజృంభించాడు. పేపరు మంచం మీద విసిరేసి ఆ ఎముకల గూడు మెడ ఎముక పట్టుకొని సందుచివర దాకా గెంటి వచ్చాడు.

పేపరు మీద విసుగుపుట్టింది గోపాలరావుకు. విసిరి నేలకేసి కొట్టాడు. వెనకాల వైపున పెద్ద హెడ్డింగు. జపానులో వ్యభిచార నిర్మూలనకు ప్రభుత్వ చర్యలు. ప్రజలు చర్య తీసుకోవాలి గాని ప్రభుత్వం రూలు పెడితే ఏమవుతుంది గనక. అసలు ఆ వృత్తి మాన్పించాలని, అటువంటి వాళ్ళందరికి జీవనోపాధి కల్పించాలని తను చాలా కాలం నుంచి అనుకుంటున్నాడు. ఏ రకమయిన జీవనోపాధి కలిగించాలి అను విషయం మీద అతనికి చాలా అభిప్రాయాలున్నాయి. అవన్నీ గుర్తు తెచ్చుకుందా మనుకున్నాడు. బుర్ర వేడెక్కబోతుండగానే మళ్ళీ ఎవరో బిచ్చగత్తె వక రెండేళ్ల చంటివాడిని చంకలో వేసుకుని దణ్ణాలు పెట్టుకుంటూ వచ్చింది.

బహుశా పాతికేళ్ళు వుండివుంటాయి. వేషం అవకరంగావున్నా ఆకారం బాగానేవుంది. అందానికి కావాల్సిన వస్తువులు గానీ, కళ్ళు ముక్కు వగైరాల కొలతలు గానీ స్టాండర్డు కొలతలు కాకపోయినా చూడటానికి పొందికగానే వుంటాయి. ఆమెను చూస్తే జాలి కలిగింది. తన వంటి భాగ్యవంతుడు పెళ్ళి చేసుకుని వుంటే ఈ రోడ్ల వెంబడి తిరిగే కర్మ పట్టేదేనా!

ఛీ! అనుకున్నాడు. తనకు చేతనయిన సాయంచేసి పంపిద్దామనిపించింది. మనీ పర్సు తీసి చూశాడు. చిల్లరలేదు. పది రూపాయల కాగితం వక్కటిమాత్రం వుంది. బిచ్చగత్తె అతని వంకచూస్తూ నిలబడింది. కత్తి తీస్తుందేమోనని భయంవేసింది. అంతకంటె వాడిగా

పున్నాయి ఆమె చూపులు. పది రూపాయల కాగితంతీసి "ఇది తీసుకో" అన్నాడు.

బిచ్చగత్తె నవ్వింది. ఏమిటో అర్థం చేసుకున్నట్లు తల ఆడించింది. చిరునవ్వు ముఖంతో కాగితం అందుకుని అతనివంక సూటిగా చూస్తూ యింటిలోపలి వైపుకు వయ్యారంగా అడుగులు వేసింది. అతనిలో పశుత్వం తొంగిచూచింది. చకచకా ఆమెవైపు అడుగులు వేసి 'లోపలకి పద' అన్నట్లు చెయ్యి చూపించాడు. ఆమె అడుగులు వేసింది. అతను వెనకాల నడుస్తున్నాడు. ఆమె చేతిలో పావ అతనివంకచూసి నవ్వింది. ఆ పావలో అతని ప్రతిబింబం కనపడింది. అతని మీద తేళ్లూ, జెర్రిలూ ప్రాకి నట్లయింది.

వక్కసారిగా ఆమె చెయ్యి పట్టుకుని జరజర గేటుదాకా లాక్కుపోయి "పో అవతలకి, మళ్ళీ ఎప్పుడూ ఇక్కడ అడుగు పెట్టక" అంటూ బిగ్గరగా గదమాయించాడు.

పేపరు తీసి, నులక మంచం ఎత్తేసి యింట్లోకి పోయి తలుపు బిడాయించాడు. ఏదైనా పుస్తకం తీసి మనశ్శాంతి చేకూర్చుకుందా మనుకున్నాడు. అలమారులో అతనిచేతికి "అసమర్థుని జీవితయాత్ర" దొరికింది.



# జన్మహక్కు

ఆ యింట్లో గడియారానికి గూడా నిద్రపడు తున్నట్లులేదు. అర్ధ రాత్రి యినా మెలకువతోవుండి లెక్క తప్పకుండా పన్నెండు గంటలూ కొట్టింది. ఒక్కొక్క గంటా లెక్కపెడుతూ రాఘవరావు మంచంలో అటూ యిటూ మసులుతున్నాడు తన కేవేళప్పుడు కబురు వస్తుందోనని.

ముసలమ్మ వంటింటి గుమ్మం దగ్గరే మండిగం తలగడా మాదిరి చేసుకుని దొంగ నిద్రపోతోంది. గోడ గడియారం గంటలు వినబడ గానే వులిక్కిపడిలేచి "ఎట్లా వుందే అమ్మాయి" అంటూ ఆవలించింది. అప్పటిదాకా పక్కనే పడుకున్న జానకి కనిపించక పోయేటప్పటికి, ముసలమ్మ ఒకసారి కళ్లు నులుముకుని లేచి కూర్చుంది. అప్పటికి గాని ఆవిడ స్వప్న జగత్తులోనుంచి వూడి పడలేదు.

జానకి దొడ్డివాకిలి తీసి తలుపు ఆనుకుని మూలుగుతోంది. ముస లమ్మ దృష్టి అటు పోవటం తోనే "ఎట్లావుందే అమ్మాయి" అంటూ చకచకా అటువైపు వెళ్లింది.

"కాళ్ళు నిలవటంలేదు మామ్మగారూ..." జానకి మూలుగు కొంచెం హెచ్చించి దొడ్డిలోని గిలక బావివైపు చూసింది.

"పెద్దదాన్ని యిక్కడే యిదైపోయాను గాదుటే నాతో యింత వరకూ ఎందుకు చెప్పలేదే..." ముసలమ్మ నెత్తిన గుడ్డ జారిపోకుండా పైకి లాక్కుని "వరేయి రాఘవా! ఏం నిద్దరా...అంతా మొద్దుల్లాగా అలా పడు కున్నారేం రా....వరేయి రామూ..." గబ గబా రాఘవరావు పడుకున్న గదివైపు నడిచింది.

"నా నిద్ర వక్కడిదీ చెడిపోతే చాల్లే అమ్మమ్మా...పిల్లల నిద్ర గూడా ఎందుకు పాడు చేస్తావు" రాఘవరావు దుప్పటి కాళ్ళతో కిందకి తోసి విసుక్కుంటూ లేచాడు.

"నీకే లేరా...ఈ ప్రపంచంలో వుంది పిల్లలు...ముందర వాళ్లని లేవగొట్టి ఆ గది ఖాళీ చెయ్యాలి.....అలా నిలబడతావేం రా తలుపు చెక్కలాగ"

రాఘవరావు జుట్టు వేళ్ళతో సరి చేసుకుని "పద పండయాత్రకి" అన్నాడు.

ముసలమ్మ గబగబా గదిలోకి పోయి రాము, వేణు, శాంతి పక్కెరాల సంచరినీ రెక్కపట్టుకు లేవదీసి "సావిట్లోకి పదండిరా పడి నిద్రపోదురు గాని ఊఁ" అంటూ గదమాయించింది.

"ఊరుకో అమ్మమ్మా నువ్వు... నేను చెప్తాగా.... పండిరింటే నాన్నా. గది ఖాళీచెయ్యాలి గాని, మా బాబు గదూ... పందిరిమంచం మీద పండుకో పెడతానుగా...మా చంద్రం మం...చివాడు..." రాఘవరావు పిల్లవాడి వీపుమీద నిమురుతూ రెండో చేత్తో బుగ్గలు స్పృశిస్తున్నాడు

"యింత సాగినట్టే... తండ్రా చెబుతుంటే మీ వాక్కూడూ..." ముసలమ్మ గావు కేకతో పిల్లలంతా వక్కసారి లేచి సావిట్లోకిపోయి ఎవరికేది అందుతే దానిని పట్టుకు కుసుకు తీయటం మొదలు పెట్టారు.

"ఆ మంచం పట్టుకు రారా... సులకది... ఆ. అదే రాముగా ....నువ్వు పోయి సింగిని పిలుచుకురారా..."

"ఎక్కడే అమ్మమ్మా..." రాము కళ్ళు నులుముకుంటూ వాకిట్లోకి చూచాడు 'అంత చీకట్లో బయటికి పోవాలిగదా' అని భయపడుతూ.

"మాబాబు గదూ... బ్యాటరీ లైటు తీసుకుపో...వెంకన్న బావి లేదూ... దాని పక్కన గుడిసెలో వుంటుంది... కిందపడు పోలేదురా...మతి మరుపూ నువ్వూ ను." ముసలమ్మ గూట్లోనుంచి బ్యాటరీ లైటు తీసి రాముడి చేతికిచ్చి వంటింట్లోకి పోయింది.

జానకి అట్లాగే కూలబడివుంది. రాఘవరావు గూడా వంటింట్లోకి ముసలమ్మతో పాటు పోయాడు జానకిని గదిలోకి తీసుకురావటంలో సాయం పడదామని.

"వద్దండి...., నేను నడుస్తాను" జానకి మోకుంతో ముసలమ్మ మీద వాలుతూ తూలుతూ గదిలోకి వచ్చింది.

పంటి పిల్ల పాలకోసం అవురావురు మని ఏడుస్తోంది. శాంత పసిపాపను సముదాయించటం చేతకాక ఏడుపు మానిపిద్దామని పట్టుకు బాప కొడుతోంది. వేణు శాంత చేస్తున్న అల్లరిని సహించలేక దాని జుట్టుపీకి నాలుగు చెంపకాయలు కొట్టాడు. శాంత ఎదురు కొట్టలేక పసిపాపతో శ్రుతి కలిపి ఏడుపు ప్రారంభించింది.

"ఓసి గోల పాడయి పోను"ముసలమ్మవచ్చి ఎదురుగా కూర్చున్న వేణుకు నాలుగు తగిలించింది. వాడుగూడా ట్రూపులో చేరి ఏడవటం మొదలు పెట్టాడు. రాఘవరావు అక్కడి మంచాలు ఇక్కడా, ఇక్కడివి అక్కడా సర్ది నలుగురికీ పక్కలమర్చి పడుకోబెట్టాడు. యిప్పుడు ఎవరి మంచం మీద వారు పడుకుని తీరికగా వేరు వేరు శ్రుతులలో ఏడుస్తున్నారు.

జానకి మూలుగు ఎక్కువయింది. ముసలమ్మ గదిలోకి, బయటికి ఆసులో గొట్టం లాగా తిరుగుతోంది. రాఘవరావు వాకిట్లోకి గది దగ్గరికి గూడ్సు పెట్టెలాగా కదులుతున్నాడు. సింగి యింకా రాలేదు. రాము దాని సంగతైనా ఎత్తలేదు. "నిద్రలేపి పిలుచుకు వస్తూవుంటాడు బహూశా" అనుకుంది ముసలమ్మ.

రాఘవరావు బెడ్‌లైటు తీసుకుని వాకిలిదాకా పోయి అది ఆరిపోవటం వలన మళ్ళావచ్చి లాంతరు తీసుకువెళ్ళాడు. సందు చివరి దాకా వెళ్ళి చూసివద్దామను కున్నాడు. "పూరికే అక్కడిదాకా పోతే మటుకు అమర్దాగాని ఏం వుపయోగం" అనుకుని మళ్ళా వెనక్కి వచ్చాడు. గదిదగ్గరకు రాగానే వక్కసారిగా మూలుగు ఎక్కువయి నట్లు అనిపించింది.

"ఎట్లావుంది జానకీ" గదితలుపు తెరిచాడు రాఘవరావు. ముసలమ్మ లోపలనుంచే తలుపు ఫెడీలుమని వేసి "సిగ్గు లేదుట్రా రాఘవా.. మహాగదితలుపు తీస్తున్నావు" అంటూ అరిచింది.

రాఘవరావు సిగ్గుతో కుదించుకుపోయాడు. రాము వస్తున్నాడో లేదో చూద్దామని, యింట్లో పనిచేస్తున్నదీ ఒకటే లాంతరవటంవలన, మూలవున్న లాంతరును బయటకు తీసుకు వచ్చాడు ఆ పూట పని

కద్దైనా ఆదుకుంటుం దేమోనని. కిరసనాయిలు పోసి వెలిగించగానే ఎవరి అదృష్టమో తెలియదు గాని లాంతరు మటుకు వెలిగింది.

కొత్త లాంతరు గది బయటి ముక్కాలి పీటమీద పెట్టి అప్పుడే వెలిగించిన లాంతరు తీసుకొని వీధిలోకి బయలుదేరాడు. సందు చివర దాకా పోగానే లాంతరు కాస్తా గుప్పుమంది. పంచప్రాణాలు ఒకసారి కట్ట కట్టుకుని ఎగిరిపోయి నట్లయింది. పెద్ద పెద్ద అంగలువేసుకుంటూ యింటికి చేరాడు యుద్ధంలో ఓడిపోయిన వీరుడిలాగా.

అప్పటికే సింగి, రాము, యింటికి వచ్చేశారు. పత్రిక్కసందులో నుంచి వాళ్ళు వచ్చారని రాముం చెప్పేటంతవరకూ తెలియలేదు. సింగి గదిలోకిపోయి, ముసలమ్మను బయటికి పంపింది.

పిల్లలంతా ఎవరి మంచాలమీద వాళ్లు ఏడుపు మానేసి తీరికగా కూర్చున్నారు. పసిపిల్లలు మటుకు ఏడుపు తగ్గించలేదు. రాము పడుకోవడానికి చోటు కనిపించలేదు. అట్లాగే ఆలోచిస్తూ నిలబడ్డాడు.

సింగి గదిలోపల నుంచి "అది కావాలి...యిది కావాలని" అడుస్తోంది. ముసలమ్మ అటూ యిటూ పరుగెత్తలేక సతమత మయిపోతోంది. జానకి మూలుగు మటుకు బాగా ఎక్కువయి పోయింది. రాఘవరావు గదికి పది గజాల దూరంలో నిలబడి తల పట్టుకుని కూర్చున్నాడు.

.....ఏమిటో ఆలోచనలు అతని మెదడంతా స్వేచ్ఛా విహారం చేస్తున్నాయి. చంద్రం పెద్ద పిల్లవాడు; శాంత, వేణు, కవల పిల్లలు. దాని తర్వాత చంటిపిల్ల. ఇప్పటి విషయం కనపడుతూనే వుంది. పెళ్లి చేసుకుని స్వేచ్ఛగా బ్రతికిందే కనపడలేదు.

కాపరానికి వచ్చిన అయిదో నెల లోనే సూడిదలనీ, తర్వాత పురిటికనీ జానకిని పుట్టింటివారు తీసుకు పోయారు. అప్పుడే అతని మనస్సు కొద్దిగా చలించింది. ఈ వరసని సంతానం పెరుక్కుంటూ వస్తే తన జీతం కాదుకదా, తన వూళ్ళో వాళ్ళందరి జీతాలు కలిపినా తన కుటుంబ పోషణకు సరిపోదేమోనని భయపడ్డాడు. ఆ భయమే అతన్ని, జానకి పురుడు పోసుకున్నా, తనింటికి తొందరపడి తీసుకు

రాకుండా చేసింది. తనొక్కడికి తోచదని తన బావమరిది రాముని తెచ్చుకున్నాడు. అప్పటినుంచి చదువుకని అతనితో పాటే వుండి పోయాడు.

జానకిని తనింటికి తెచ్చుకోవడానికి యిష్టం లేకపోయినా, ఆమె తల్లిదండ్రుల దగ్గరనుంచి వస్తున్న వత్తిడివలన రాఘవరావు కాదన లేకపోయాడు. చంద్రానికి అయిదో నెల అనగా జానకి అత్తవారింటికి తిరిగి వచ్చింది. రాఘవరావు చంద్రాన్ని అప్పుడప్పుడూ ఎవరూ చూడకుండా పలకరించేవాడుగాని, జానకితో చాలా ముభావంగానే వుంటూ వచ్చాడు. జానకి తన లోపం ఏమన్నా వుందేమోనని ఆత్మ పరిశీలన చేసుకుని ఏమీ తెగక బుర్రంతా పాడు చేసుకుంది.

రాఘవరావు ప్రవర్తన రోజు రోజుకూ మితిమీరి పోయింది. అప్పుడే జానకి వచ్చి అయిదారు నెలలు కావస్తున్నా మనసిచ్చి రాఘవరావు ఆమెతో మాట్లాడిన పాపాన పోలేదు. పని వుందంటూ పొద్దున్నే పోవటం, తిరిగి రాత్రి పది గంటలవుతే గాని యింటికి వచ్చేవాడు గాదు. మధ్యాహ్నంగూడా యింటికి రాని రోజులలో భోజనం ఆఫీసుకు పంపటం జరుగుతూ వచ్చింది. జానకి నిగ్రహించుకో లేక రాఘవరావుని ఒక రాత్రిపూట నిలవేసి అడిగింది. రాఘవరావు మాట తప్పించేసి "ఏం లేదంటూ" నసిగాడు. జానకికి కళ్ళ నీళ్ల పర్యంతం అయింది.

"నేనేం పాపం చేశానని — నోరెత్తి నాతో మాట్లాడడం కూడా మానేశారు..." కొంగుతో కళ్లు తుడుచుకుంది జానకి. ఆడవాళ్ళకు అనుకుంటే ఏడుపు వస్తుందని, ఆ సంగతి తెలిసినా మగవాళ్ళు మాయలో పడిపోతారని, ఏదో సైకాలజీ పుస్తకంలో రాఘవరావుకు చదివినట్లు జ్ఞాపకం.

అయినా యిది నిజం ఏడుపు గానే తోచింది. అతని తప్పు కళ్ళకు కొట్టి వచ్చినట్లు కనపడింది. జానకి ఏం తప్పు చేసిందని తను యింత మూర్ఖంగా ప్రవర్తిస్తున్నాడు? చంద్రం పురిటికని తీసుకు వెళ్ళిన తర్వాత...చంద్రానికి అప్పుడే ఏడాది వెళ్ల వస్తోంది. యింత వరకు

ఇంత కఠినంగా ఘోరంగా ఎలా మనసు గలిగావో అతనికే ఆశ్చర్యం వేసింది.

రాఘవరావు మనసులో అనుమానం వేధిస్తూనేవుంది. జానకిని దగ్గరకు తీసుకుని చెవిలో ఏదో పరిహాస్యంగా చెప్పాడు; ఆ కారణంగా తన ప్రవర్తన మార్చుకున్నాడన్నట్లు అతని ముఖంలోని చిరునవ్వు ఆమె ముఖంలో ఆనంద జ్యోతిని వెలిగించింది. "పోండి...." అంటూ అతన్ని పక్కకు తోసి గది బయటకు చరచరా నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. రాఘవరావు మనస్సుకు కొంచెం సంతృప్తి కలిగింది—ఎలాగయినా ఒక ఏడాది పాటు తనమాట బింకంగా నిల పెట్టుకో గలిగాను గదా అని.

ఆ రోజు సాయంత్రం పెద్ద పొట్లాంతో మల్లెపూలు కొనుక్కు వచ్చాడు. ఆఫీసునుంచి సరిగ్గా టైముకే బయలుదేరి యింటికి వస్తూ. జానకి పూల పొట్లం అందుకుంటూ "చంద్రానికి యిన్నిపూలు ఎందుకండీ? అందులో మొగపిల్లాడాయెను." నవ్వింది అతని వైపుచూసి. "వాటికి సరిపోయేవి వాటికే పెట్టు. మిగిలినవాటితో నాకు పని వుందిలే" అన్నాడు ఆమెను తోసుకుంటూ యింట్లోకిపోతూ. "పూలుకోండి, మరీ పప్పలాయిగావుందే" అంది జానకి.

అదే తారీఖు మళ్ళీ అయిదు నెలల తర్వాత వచ్చింది. జానకి తల్లి పెద్ద చలిమిడి బుట్టతో దిగింది ఆ యింట్లోకి. మలుచూలు గూడా పుట్టింట్లోనే పోయటం వాళ్ళింటి ఆచారమట. రాఘవరావుకు ఆ గొడవలన్నీ తెలియవు. అయిన అవమానానికి పురుడు తనింట్లో గూడా ఎందుకని 'తీసుకు వెళ్ళండి అత్తయ్యా...మీ మాట ఎప్పుడు కాదన్నానుగనుక' అన్నాడు రాఘవరావు. ఆవిడ కణతల మీద వేళ్ళు నొక్కుకుంటూ 'బంగారునాయనా నీ అత్త కడుపు చల్లగా పదుగురు పిల్లలకు తండ్రి అవుతావు' అంది. రాఘవరావు ఆ దీవన వినటానికి మనసొప్పక ఏమిటో గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

జానకి పురిటికి వెళ్ళిపోయింది. రాఘవరావు, జానకి తమ్ముడు రాముతో కాలక్షేపం చేస్తున్నాడు. వంటపని అంతా రాఘవరావు

అమ్మమ్మేమ్మ చూస్తుంది. కూరలూ, నారలూ రాము పట్టుకు వస్తున్నాడు. రాఘవరావు పనంతా నెల మొదటి తారీఖున ఖాతా కొట్లన్నిటి లోనూ బాకీలు చెల్లించి వెయ్యటం, నెల పొడుగునా సరిపొయ్యేటట్లు బియ్యం, పప్పు దినుసులూ తీసుకువచ్చి యింట్లో పడెయ్యటం.

అత ననుకున్నట్లు గానే పురుడు రాగానే వుత్తరం వచ్చింది జానకి తండ్రిగారి దగ్గరనుంచి. భగవంతుని దయవలన ఈ సారి కవల పిల్లలు పుట్టినట్లు. వాళ్ళ పేర్లు వేణు, శాంత అని పెడదామని వాళ్ళు మోజు పడుతున్నట్లూ, తన అభిప్రాయం తెలియజేస్తే సంతోషించ బోతున్నట్లూ, వ్రాశాడు. రాఘవరావు వుత్తరము చదువుకుని కూల బడ్డాడు 'ఏడాది ఆగినా పిల్లల నెంబరు మటుకు సాలువారీ కాక తప్ప లేదురా భగవంతుడా' అనుకుంటూ.

ఈసారి రాఘవరావుకు చికాకెత్తి పోయింది. పురుడు వెళ్ళ గానే వక క్షణం ఆలస్యం చెయ్యకుండా జానకిని పిల్లలతో సహా తీసు కొచ్చి తనింట్లో దిగపెట్ట వలసిందని వుత్తరం ఒకటి గబిబిజిగా బరికి పోస్టు బాక్సులో కసికొద్దీ గిరాటు వేశాడు. అక్కడ జానకి తల్లి దండ్రులు ఆశ్చర్య పోయారు. 'తొలుచూలు వెళ్ళగానే పోరితే గాని తీసుకు పోని అల్లుడికి మలుచూలు కాగానే అంత అప్యాయత ఎక్కడి నుంచి పుట్టుకు వచ్చిందా' అని.

జానకి తల్లి పురిటిమంచంమీద కూర్చుని 'ఏమిటే జానకి నాకు మంచి అల్లుడే దొరికాడు వట్టి తిక్క మనిషిలాగా వున్నాడే' అంది. జానకి నవ్వి వూరుకుంది. 'ఎంత మారిపోయావే తల్లీ' అంటూ మెటికలు విరుచుకుంది జానకితల్లి.

చంద్రాన్ని వెంటబెట్టుకుని వెళ్ళిన జానకి చంద్రంతోపాటు వేణు, శాంతలను గూడా వెంటబెట్టుకువచ్చింది. బండి దిగుతుండగానే ఎదురు వెళ్ళాడు రాఘవరావు. జానకి వేణుని ముందుదిగిన తల్లి కందించింది. శాంతను రాఘవరావు చేతి కందిస్తుంటే మధ్య తనెందు , కనుకుంది కాబోలు జానకి తల్లి. వేణుని తీసుకుని లోపలికి వెళ్ళింది. జానకి బండి కమ్మి పట్టుకుని మెల్లిగా దిగుతూ 'ఏమండి...అంత తొందరచేశారు...

మా అమ్మవాళ్ళ నన్ను నాలుగు రోజులు వుంచుకుందామని సరదా పడుతుంటే' అంది.

"ఫలితం వక్కటే అయినప్పుడు మళ్ళీ అక్కడే ఎందుకూ... యిక్కడే పడివుంటే సరిపోతుంది" విసురుగా లోపలకు వెళ్ళిపోయాడు పిల్లను తీసుకుని. జానకి ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ యింటి లోకి మెల్లిగా అడుగులు వేసింది.

జానకి తల్లి వూళ్ళో వున్న పదిరోజులూ మల్లెపూలు యింటికి రాకపోతే బజారు కయినా పోయి తీసుకు వచ్చేంది. గులాబి పూల యితే దొడ్లోనేవిరగపూస్తున్నాయి. జానకి కొప్పునిండా పూలు పెట్టుకుని తనవంక వెక్కిరిస్తున్నట్లు అనిపించేది.

జానకి తల్లి యింటికి వెళ్ళిపోయింది.రాఘవరావు పొద్దున్నే అందరి కంటే ముందుగా లేచి దొడ్లో పూసిన గులాబి పూలన్నిటినీ కోసి ఎవ రికీ కనపడకుండా దాచేశాడు. యింట్లో ఎప్పుడు . ఎవరూ పూలు కొన గూడదని ఒకనిర్ణయం జారి చేశాడు. చంద్రానికి అప్పు మాటలు వచ్చేస్తున్నాయి. జానకి చంద్రానికి పెద్దజడవేసి చెవులో రోజూ ఎదో రహస్యం నూరిపోసేది. రోజూ మరచిపోతున్నాడు. ఆరోజు రహ స్యంతో పాటు నాలుగు దెబ్బలు గూడా తగిలించటం వలన రాఘ వరావు రాగానే జడపట్టుకుని "నాన్నా పూలు కావాలి" అన్నాడు. జానకి మంచం మీద పిల్లలకు పాలిస్తూ అతని వంక చూస్తూ చిలిపిగా నవ్వింది.

"పూలూ లేవు గీలూలేవు పోరా. ఎక్కడో పూలు కావాలిట ఆడపిల్లలకు మల్లే" చీదరించుకుంటూ గదిలోకి పోయాడు. జానకి చెప్పిన ప్రకారం చంద్రం ఏడుపు మొదలు పెట్టాడు. రాఘవరావు మెల్లిగా విప్ప తీస్తున్న కోటును వక్కసారి లాగేసి,మంచం మీదపారేసి బయటకు వచ్చాడు. చంద్రం కళ్ళు నులుముకుంటూ తండ్రి రావటం చూసి ఏడుపు పెద్దది చేశాడు.

రాఘవరావు చంద్రాన్ని ఎత్తుకొని "తప్పుకాదు బాబూ ఏడవచ్చా! ఆడవాళ్ళకి గానీ పూలు మన మగ వాళ్ళ కెందుకురా నాన్నా. చూడు

నేను పూలు పెట్టుకున్నానూ" బుగ్గలను సవరిస్తూ సముదాయించటానికి ప్రయత్నం చేస్తున్నాడు.

"అయినా ఈ కొంపలో ఆడవాళ్ళకు మటుకు పూలెందుకూ" అంది జానకి మంచంలోంచి.

"మనుషులుండగా పూలెందుకూ" అన్నాడు రాఘవరావు చంద్రాన్నికిందికి దింపుతూ.

."ఆ....వున్నారు. ఎందుకూ?" అంది జానకి వస్తున్న నవ్వును ఆపుకుంటూ.

రాఘవరావు నవ్వుకుంటూ వంటింట్లోకి పోయాడు.

ఈసారి జానకి తల్లివచ్చింది. వచ్చినట్లుగానే తిరిగివెళ్ళిపోయింది. "పురుటూలు అంటే పోని గదా అని వూరుకున్నాం గాని, తడవ తడవకీ ఏడాదికి ఆరునెలల చొప్పున మీ యింట్లోనే వుంటే మాకేం ముద్దుముచ్చట అక్కర్లే దనుకున్నారా" అని నిశితంగా విమర్శించింది రాఘవరావు అమ్మమ్మ.

· జానకి తల్లి చేతిలో వున్నపని గనుక అప్పాల్లో వాళ్ళందరికీ జానకి వద్దని చెప్పుతున్నా వినిపించుకోకుండా పంచదార చిలకలు, చలిమిడీపంచిపెట్టి వచ్చింది.

ఇంట్లో జనసంఖ్య పెరిగింది కొత్తగా వచ్చిన చంటిపిల్లతో. "ఈ పిల్లపేరు పెట్టడానికి తోంచదేం" అని రాఘవరావుతో జానకి అన్నమాటలు గుర్తువచ్చినాయి. అప్పటినుంచి యిప్పటిదాకా ఆపిల్లపేరు "చంటిది" అంటూ చలామణీ అవుతూ వచ్చింది. కాని యిప్పుడో "చంటిది నంబరు వన్" "చంటిది నంబరు టూ" అంటూ పిలవాల్సి వచ్చేటట్లయింది.......

రాఘవరావు గతంలోనుంచి వర్తమానంలోకి వచ్చాడు అతి కష్టం మీద. ఒక్కసారి వులిక్కిపడి గది దగ్గరకు వెళ్ళి "ఎట్లా వుంది అమ్మమ్మా..."అని అడిగాడు.

"యిప్పుడే కాదురా సింగి వచ్చింది....బురఁపట్టుకు యింకా కాసేపు అట్లాగే కూర్చో. తొందరపడితే-మనచేతిలోవున్నపని గనకనా" అంది వోరగా తెరిచిన గది తలుపులు తిరిగి మూసివేస్తూ.

రాఘవరావు బరువుగా అడుగులు వేస్తూ చంటిపిల్లవున్న మంచం దగ్గరకుపోయి దానిమీద కూర్చోపోతుండగానే "క్యావు క్యావు" మంటూ గదిలోంచి ఏడుపు వినవచ్చింది.

చంటిపిల్ల బుగ్గలు మృదువుగా తాకుతూ "యివ్వాల్టినుంచి నిన్ను సుశీ' అని పిలుస్తాను"అన్నాడు. ముసలమ్మ గదిలోనుంచి తడబడుతూ వచ్చి 'ఆడపిల్లరా రాఘవా, ఆనందం అంతా వెళ్ళగక్కింది.

"ఆడపిల్ల అంటే అదృష్టం అనిరా. మళ్ళీ ఆడపిల్ల అంటే నీ జాతకం బంగారం అన్నమాట" అంది ముసలమ్మ మళ్ళీ గదిలోకి వెళ్ళిపోతూ.

"మళ్ళీ...ఆడపిల్లేనా. పేరేం పెట్టమంటావే"అంటూ మంచం మీద కూలబడ్డాడు రాఘవరావు.

సింగి నగరుస్తూ గది బయటకు వచ్చింది. ".ఎంత. అదృష్టం అయ్యగోరుది ... పిల్లా తల్లి బతికి బట్ట గడతారనుకోలేదయ్యా... మాచెడ్డ కట్టం అయిపోయినాది అబ్బ...అబ్బ..." సింగి ముఖం అంతా చిటచిట లాడించి గంభీరంగా నిట్టూర్చింది.

"ఏం సింగీ ఏమయింది?" రాఘవరావు వుత్సుకత వెళ్ళబుచ్చాడు.

"ఏం సెప్పమంటారయ్యా.........కవలపిల్లల్ని గని ఏడాదన్నా సరిగ్గా నిండింది గాదామె...పిల్లలో పానం ఏముందండి....మీతో చెప్ప టానికయితే నాకే మనసాడటంలేదు గాని, మీరే యేదైనా ఆలోచన సెయ్యరాదుటండీ" సింగి నవ్వబోయి ఎందుకన్నట్లు వూరుకుంది.

ముసలమ్మ యింట్లో నుంచి వస్తూనే "వాడితో ఏం కబుర్లే... నీ కేది కావాలో నన్నడగ రాదుటే" అంది.

"నేనేం మీ సింగిని కొరుక్కు తినటం లేదులే"విసురుగా మంచం మీదనుంచి తుండుగుడ్డ భుజంమీద వేసుకుని నిలబడ్డాడు.

"అమ్యేం మాటలండి అయ్యగారూ...." సింగి ఎక్కడలేని సిగ్గు అభినయిస్తూ ముసలమ్మ వైపు వెళ్ళింది.

"అసలే ఆడపిల్ల...! అందులో మూడోది!! దీనికి భారసాల లాంటి ఆర్భాటాలు ఏవీ చెయ్య నక్కరలేదు" అని మనసులో తీర్మానించుకున్నాడు. జానకి తల్లి ఆడదవటంవలన 'ఏం ,ఆడపిల్లయితే అంత తీసిపోయిందా....దీనికిగూడా అందరితోపాటు ముచ్చటలన్నీ తీరాల్సిందే" అంటూ పట్టు పట్టింది.

వీల్లేదన్నాడు రాఘవరావు.

"ఇక్కడ చెయ్యటం యిష్టంలేకపోతే మా వూళ్ళో చేయిస్తాం...అక్కడికి పంపించండి" అంది జానకి తల్లి.

"మాకేం చేతకాక మానెయ్యలేదు" అన్నాడు రాఘవరావు.

"చేతనయితే చెయ్యండి...నే నడిగేది అదేగదా!" అంది జానకి తల్లి. ఆడవాళ్ళతో వాదించటం అంత బుద్ధి తక్కువ పని లేదనుకున్నాడు రాఘవరావు.

భారసాల యథావిధిగా జరిగిపోయింది. వచ్చిన పెద్దలంతా అక్షింతలు చల్లుతూ "పదిమంది పిల్లలతో యిల్లు కలకాలం వర్ధిల్లాలి" అని దీవించారు,

"వీళ్ళ యింకా అయిదు భారసాలలు, ఈ యింట్లో జరగాలని చూస్తున్నారు కాబోలు....ఈ సారి వక్కళ్ళని గూడా పిలవనని" నోరు కరుచుకున్నాడు.

గడియారం ముళ్ళు తిరుగుతుంటే, సూర్యుడు ఉదయించడం, అస్తమించటం—రోజులు గడిచి పోవటం జరుగుతోంది. ఈ మధ్య గోడ గడియారం పాడయిపోయి ఆగిపోయినా, సూర్యుడు మటుకు ఆగలేదు. రోజులు గడచిపోతూనే వున్నాయి. జానకిని వదిలివుండే వీలు కనపడటంలేదు. వదలక యింట్లోనే వుండనియ్యటం వలన కలిగే ప్రాలాదాయాన్ని ఆరికట్టటం ఎలాగో అర్థంకావటంలేదు.

రాఘవరావు ఒకరోజు తెల్లవారుజామున లేచి బాగా ఆలోచించాడు. ఫామిలీ ప్లానింగులాంటి మాటలు కొన్ని మెదడులో మెరిసి

అప్పుడే అదృశ్య మయి పోయినాయి. తను ధీరోదాత్తుడై తన కుటుంబం పెరుగకుండా వుండేందుకు సలహా అడుగుదామన్నా అందుకు తగిన డాక్టరు ఆ వూళ్ళోనే కాకుండా, దగ్గరలో వున్న మరే వూళ్ళో గూడా లేడు.

జానకితో ఆవిషయం తీసుకువద్దామని ఎన్నిసార్లో ప్రయత్నించి విఫలు డయాడు. జానకి దగ్గరకు ఎప్పుడుపోయినా పసిపిల్లను వళ్లో పెట్టుకునే కనబడుతోంది. వంట పనంతా మునలమ్మ వక్కత్తే చూస్తోంది. జానకి దగ్గరకు పోయి పెదిమ కదపగానే పసిపిల్ల తనను అక్కర్లేదని చెప్పటానికి వస్తున్నాడన్నట్లు చూసేది. రాఘవరావు గుండెను పదిలం చేసికోలేక వెనక్కి వచ్చేస్తున్నాడు.

ఆరోజు రాత్రి జానకి తమలపాకు చిలకలందిస్తూ చాలా ముభావంగా "రేపు డాక్టరమ్మ దగ్గరకు వెడదామునుకుంటున్నాను" అంది. రాఘవరావు కొంచెం తికమకపడ్డాడు.

"వంట్లో కులాసాగా వుంటోందా జానకీ...." పసిపాప అతనివైపే తిరిగి వుంది. పాప కప్పుడే నెల వెళ్లింది. చూపు నిలప గలుగుతోంది.

"వంట్లో యిప్పుడైతే కులాసాగా వున్నా. ముందు ముందు ఎట్లా వుంటుందోనని భయంగా వుందంటి" అంది జానకి.

"పిల్లలు యింక కలగకుండా ఏదైనా మందిమ్మని అడుగుదామని వుంది."

"తొందరపడి ఏమందు పుచ్చుకోక సుమా...బాగా ఆలోచించి పుచ్చుకో....అది సరేగాని యీవూళ్ళోవున్న డాక్టరమ్మ మంచిదేనా" రాఘవరావు అడిగాడు.

"మంచిదేనా...అంటే"

"ఏం లేదు; మందు శ్రద్ధగా మంచిది యిస్తుందా అని" అటువంటి సంభాషణ ప్రత్యక్షంగా చెయ్యటం యిద్దరి మనసులకూ కటువుగానే వుంది. రాఘవరావు వీపుమీది భారం తగ్గినట్లయింది. వంగిన నడు

ముసు సూటిగా నిలిపి "రేపు వాగానే పంపి పోయిరా...మళ్ళీ యీమాట మా అమ్మమ్మతో అనక" అన్నాడు.

జానకి మనస్సు పరిపరి విధాల పోతోంది. యింటినిండా "నా కది కావాలి......యిది కావాలి" అని వేధించుకు తినేవాళ్ళే. పిల్లలంటే ఎప్పుడన్నా వచ్చి చూసి పోయేవాళ్ళకు ముద్దుగాని—రోజూ యింత కంటే నరకం యింకొకటి లేదు సుమా! అనుకుంది.

ఆసుపత్రికి పోవటం, అందులో అటువంటి పనిమీద, అదే కొత్తయినా, కావలసిన డాక్టరు దగ్గరకు సూటిగానే చేరుకోగలిగింది. అప్పటికే ఆవిడ చుట్టూ చాలా మంది చేరి వున్నారు. జానకి ఎలానయితే నేం ధైర్యం చేసుకుని "నమస్కారం మేడమ్" అంది. ఆ వూళ్ళో నమస్కారం పెట్టగల సంస్కృతి వున్నవాళ్ళే తక్కువ. అందులో ఆడవాళ్ల మాట చెప్పటం మరీ కష్టం. డాక్టరమ్మ ప్రతి నమస్కారం చేస్తూ చాలా సంతోషంగా "ఏం కావాలమ్మా" అంది.

"మీతో కొంచెం రహస్యంగా మాట్లాడాలి" అంది జానకి. పక్క నున్న ఆడవాళ్లలో చాలామంది ఎవరి ముక్కులమీద వాళ్ళు వేళ్ళు వేసుకున్నారు, ఆడదాని దగ్గర దాచే రహస్యం ఏమిటా అని.

"అట్లాగే, తప్పకుండా. చూడండి! మీకంటె ముందుగావచ్చి కూర్చున్న వాళ్లని పంపించేస్తే, మనం కొంచెం తీరికగా మాట్లాడుకో వచ్చు" అంది డాక్టరమ్మ స్టెతోస్కోపును మెడమీదనుంచి చెవులమీది కెక్కించుకుంటూ.

ఒక్కొక్కరే ముందుకు వస్తున్నారు. మందు చీట్లు రాసి యిచ్చేస్తోంది డాక్టరమ్మ.

"ఏమమ్మా .. నీకేం కావాలి" డాక్టరమ్మ సిగ్గుపడుతున్న 30 యేళ్ల పడుచుదాన్ని చూసి అడిగింది. ఆమె. తలమీద అక్కడక్కడా తెల్లని వెంట్రుకలు నల్లటి వాటిని కాదని కనపడుతున్నాయి.

"మీతో రహస్యంగా, మాట్లాడదామని...."నసిగింది ఆమె. "చెప్పమ్మా...మన ఆడవాళ్ల దగ్గర ఆడవాళ్లు మాట్లాడటానికి సిగ్గెందుకు చెప్పమ్మా,చెప్పు..." డాక్టరమ్మ జానకివైపు తిరిగి "యిటువంటి వాళ్లని

గురించి మనలో సామెత గూడా వకటి వుండాలి గదండీ" అంది. జానకి ఉక్కిరి బిక్కిరి అయి ఔనన్నట్లు తల వూపింది.

"మా ఆయన కేమైనా మందిప్పిస్తారేమోనని''

"ఏం...." ·

"కాపురానికి వచ్చి అయిదేళ్లయిందండి....నా కడుపున వక కాయ పండుతే మా అమ్మ చూద్దామని అనుకుంటూంది" ఆమె స్వరం గీరపోయి గద్గదమైంది. ఆ పడుచుదాని బాధ డాక్టరమ్మతోపాటు జానకి గూడా అర్థం చేసుకుంది.

"నీకేం భయంలేదమ్మా...సింగీ! ఈ విడని తీసుకుపోయి పరీక్ష చేయవే__మీ ఆయన్ని పట్నం పంపించమ్మా...అక్కడ పరీక్షచేసి మందిస్తారు....మేం యిక్కడ చేయగలిగిందేమీ లేదు..." ఆ పడుచు దాని అమాయకమైన మాతృత్వ వాంఛకు జానకి అబ్బురపోయింది.

"నీ పేరేమిటి...."

"పోచమ్మ..."

" నీకేం కావాలి..."

చెప్పటానికి సందేహించిందామె. డాక్టరమ్మ నవ్వుతూ చెప్ప మన్నట్లు తల వూపింది. తన కడుపువంక అదే పనిగా చూస్తూ__

నాకెనిమిది మంది పిల్లలమ్మ గోరూ...చచ్చిపో తున్నా నంటే నమ్మండి...మళ్ళీ నేమో..." డాక్టరమ్మ ఆ నిండు చూలాలివంక చూచింది.

"బాగానేవుందే చల్లని కడుపన్నమాట పదిమంది పిల్లల తల్లివి అయినావంటే...'

"అది కాదండీ.... దీని నేమన్నా చెడగొ...డ...తా"

"ఛీ...చెంపలు వేసుకో...సిగ్గులేదూ! డాక్టరమ్మ మండి పడింది "భగవంతుడు నీమీద కరుణించి బిడ్డనిస్తానంటే వస్తున్న బిడ్డనిమధ్యలో నాశనం చెయ్యమంటావు...ఆ"...ఆ.... చూలాలు గజగజ లాడిండి.

"మీ అమ్మా అయ్యా అంతా బాగున్నారా" డాక్టరమ్మ సముదా యింపుగా అడిగింది మళ్ళా.

"ఆ........."

"ఏ వూళ్ళో..."

"యిక్కడేనండి..."

"నాదగ్గరికి వకసారి తీసుకురా. మీ అమ్మని తీసుకువస్తే చాల్లే. మీ ఆయ్యకి ఎంతమంది పిల్లలు."

"సరిగ్గా పదిమందండి."

"యింకేం బాగానేవుంది. అయ్యవోలిక వచ్చిందన్నమాట."

"అంతా అదే అంటున్నారండి.నేనేమో చేసుకోలేక చస్తున్నాను."

"ఈ మాటే మీ అమ్మ అనుకుంటే నీ గతేం అయేది"

ఆ చూలాలు కంపించి పోయింది. అటువంటి ఆలోచన తట్టలేదు యింతవరకూ.

"అమ్మా! పొరపాటయిందమ్మా మళ్ళా ఎప్పుడూ రాను" పోచమ్మ నిండు హృదయంతో వెళ్ళిపోయింది.

"నీ పేరేం అమ్మా"-డాక్టరమ్మ, ఎంతకీ ఈ జనం తరగరేం అన్నట్లు నిర్లక్ష్యంగా అడిగింది. జానకి అటూ యిటూ చూచి లేచి నిలబడింది.

"ఈ యిద్దరే నండీ. వాళ్ళయి పోగానే మాట్లాడుకుందాం. కూర్చోండి. ఏమమ్మా నీ పనేంటి?"

అప్పుడే వచ్చిన యిల్లాలు "అమ్మా, నాకు పసిపాప నిప్పిస్తామన్నారుగా. నా అంతట కని పెంచే భాగ్యం లేకపోయినా, ఎవరిపిల్లనయినా నాపిల్ల అనుకు నయినా బ్రతుకుదామని వుంది. ఎక్కడన్నా చూశారా అమ్మా" జాలి తొణికిస లాడుతోంది. జానకి లేచి "వస్తాను. డాక్టరుగారూ మళ్ళా వస్తాను." మెట్లు గబ గబా దిగుతూ "నాపిల్లల్ని ఎవరికి ఇయ్యటానికి వీల్లేదు. భగవంతుడియ్యటోయే బిడ్డలంతా నా దగ్గరకు రావాలిసిందే. నారక్త మాంసాలన్నీ వాళ్ళకి పంచిపెడతాను. నా ప్రాణం పోయినా సరే,నాబిడ్డలకు నే నన్యాయం చెయ్యలేను"అంటూ గొణుక్కుంటూ పోయింది.

జానకి సంతోషంగా యింటికి రావటం రాఘవరావుకి ఎంతో ఆనంద దాయకమయింది. గబ గబా బజారుకుపోయి మిఠాయి, పూలు అన్నీ ఒక పెద్ద సంచీ నిండా పట్టుకువచ్చాడు. ముసలమ్మ గూడా సంతో షించింది—రాఘరావు దారిలో పడ్డాడు గదా అని.

ఆరోజు రాత్రి రాఘవరావు "వెళ్ళిన పనయిందా" అని అడిగాడు. జానకి నవ్వుతూ తల వూపింది.

అతని ఆనందానికి అంతులేదు. జానకి ఆనందానికి అడ్డులేసేలేదు. రాఘవరావు ఆమె తల నిమురుతూ "నువ్వు చాలా తెలివైన దానివి జానకీ" అన్నాడు. జానకి నవ్వి వూరుకుంది.

యిప్పుడు యింట్లో ప్రతి రోజూ పండగే! ఫస్టు తారీకు నాటి సంగతి చెప్పనే అక్కర్లేదు. యిల్లంతా పూలవనమే. అప్పుడే అటువంటి తారీకులు రెండు మూడు గడిచిపోతున్నాయి. రాఘవరావు ఆరాత్రి జానకి కోసం తెచ్చిన పట్టుచీరె అత్తాత్తుగా పెట్టెలోనుంచి తీసి—

"జానకీ నీ సమయస్ఫూర్తికి, ధైర్యానికి మెచ్చి నీకీ పట్టుచీరె తెచ్చాను" అన్నాడు. జానకి అతని వంక చూస్తూ "యిటివ్వండి చూద్దాం" అంది.

రాఘవరావు ఆమె చేతిలో చీరెను పెట్టి, రెండు భుజాలమీద చేతులు వేసి తనవైపు తిప్పుకుంటూ—

"జానకీ నువ్వు ఎంత అందంగా వున్నావు....ఈపట్టుచీరె వేసు కుంటే యింకేమన్నా వుందా" బలంగా హృదయానికి హత్తుకున్నాడు.

"వూరుకోండి మరీను. మళ్ళా నెల తప్పింది. యిప్పుడే పట్టుచీరె ఎందుకు" అంది మెల్లిగా.

రాఘవరావుకు పెద్ద అఘాతం తగిలినట్లయింది.

"అదేమిటి! డాక్టరమ్మ దగ్గరకు వెళ్ళావు గదూ....?"

"ఎందుకు అంత ఆశ్చర్యం... వచ్చే నాబిడ్డలను వద్దని చెప్ప టానికి మనసొప్పక యింటికి తిరిగి వచ్చేశాను" అంది తలవంచి అతని పాదాలవంక చూస్తూ...

రాఘవరావు నేత్రాలు అశ్రు పూరితాలయినాయి.

"నీకున్న జ్ఞానం నాకు లేకపోయింది జానకీ ....! నాబిడ్డలు నాక్కాకుండా పోవటానికి వీల్లేదు" అంటూ ఆమె భుజం మీద నుంచి చెయ్యితీసి, సావిట్లోకి వెళ్ళి నిద్ర పోతున్న పిల్లలందరికేసి చూసి పక్కొక్కళ్ళనీ ముద్దుపెట్టుకున్నాడు. జానకి తన కడుపులోవున్న పిల్లను చేతిలో వున్న పాపలో చూస్తూ ముద్దుపెట్టుకుంది.

"మా అమ్మా, నాన్నా మంచివాళ్ళు" అన్నట్లు చూసింది చేతిలో పసిపిల్ల.

# "కచటతపలు"

(కథల సంపుటి)

రచన: శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రిగారు

## పత్రికాభిప్రాయాలు.

1. కథా నిర్మాణంలో శ్రీ శాస్త్రిగారికి ఒక ప్రత్యేకమైన ప్రతిభ వుంది సామాన్య జీవితంలో నుంచి కథావస్తువును సేకరించి దానికి అత్యంత ప్రతిభావంతంగా రససిద్ధిని సాధించగలరు. సర్వాంతర్యామి అనే కథ చాలా విచిత్రమైనది. అధునాతన భావాలుగల యువకుడు పరిస్థితుల ప్రభావానికి లోనై విచిత్రంగా మారిపోవటం బహు చాకచక్యంగా చిత్రించారు.

—భారతి

2. "...ప్రథమ కథలోని నాయిక వసంతయొక్క రాగద్వేషాలు హృద్యముగా చిత్రించబడినవి. ఆయా సందర్భములలో చేసిన సముచిత వర్ణనలు, ఈ కథకు మరొక మాన్యతను కలిగించును...కథకుడు చెయ్యి తిరిగిన రచయిత, కథలన్నీ అందరికే ఆమోద ప్రదంగాను, అందుబాటులోనూ వున్నవి. లోకాన్ని చిత్రించాడు గాని కథకుడు ఎక్కడా కన్పించడు. కథలిట్లా వుండాలి.

—స్రవంతి

3. "...కథావస్తువులు చిన్నవైనా పాత్రలు కొద్దివైనా కథా కల్పనలో పాత్ర పోషణలో ఈ గ్రంథకర్త చూపినా నైపుణ్యము మెచ్చ తగినది. ఈ కథకుడు సిద్ధహస్తుడనక తప్పదు. ప్రారంభించినది మొదలు పరిసమాప్తి చెందేవరకు మధ్యలో ఏ కథను విడువ బుద్ధిపుట్టదు. అట్టి యాకర్షణయే కథారచనకు కావలసిన ప్రత్యేక గుణము, అది ఈ గ్రంథకర్త రచనలో కనబడుచున్నది.

—ఆంధ్రమహిళ

4. ఇందులో ప్రతి కథా వాస్తవిక జీవితంలో జరిగిన ఒకానొక సంఘటన. ఈ కథలలోని వ్యక్తులు మనకు నిత్య జీవితంలో కన్పించే వ్యక్తులకు ప్రతిబింబాలు.

—తెలుగు స్వతంత్ర

5. ఈ నాటి ప్రముఖ కథా రచయితలలో శ్రీ శాస్త్రిగారు ఒకరు. ...వీరుమాటలు మితముగా వాడుతారు. ఆ మాటలతోనే హెచ్చు భావాలను స్ఫురింప చేస్తారు

—కృష్ణాపత్రిక

6. కథాకథన పద్ధతిలో అనుక్షణం ఎన్నో మార్పులు వస్తున్నప్పటికి అన్నిటినీ ఆకళింపు చేసుకుంటూ తమ వ్యక్తిత్వం నిలుపుకునే నేటి బహు కొద్దిమంది ఆధునికులలో ఇసుకపల్లివారు ఒకరు. చెప్పదలచుకున్న దానిని నిశితంగా చెప్పగల సమర్థత ఈ రచయితకు ఉన్నది.

—తెలుగు దేశం

7. "...పరుష సంజ్ఞతో వున్న కచటతపలు విద్యార్థికి వెంటనే అర్థంకానట్లే యీ కథలుకూడా పద్యస్ఫురణకు అంతర్యాన్ని దూరంగా నెట్టివేస్తాయి. ...ఇసుకపల్లివారి రచనలు సాధారణత్వానికి సమన్వయించవు. తాత్త్విక దృష్టికి ప్రోద్బలకాలై ఉన్నందువల్ల పాఠకుని హృదయాన్ని వెంటనే పట్టుకోవు. అది నేటి పాఠకుని చిత్తవృత్తిలోని స్థిరతర జ్ఞానలోపం గాని రచయిత దోషంకాదు... శ్రీ లక్ష్మీనరసింహశాస్త్రికి కథా రచయితలలో మంచి స్థానంవుంది. నలుగురూ ఒప్పుకున్న విషయం అది

—ఆంధ్ర పత్రిక

8. రాగద్వేషాలు కథ చాలా బాగున్నది. కథలలో సాంసారిక జీవితపు సుఖ దుఃఖాలను రచయిత కమనీయంగా చిత్రించారు.

—ఆంధ్ర ప్రభ

9. కథలన్నింటా సూక్ష్మ దర్శనమువుంది

—గోలకొండ పత్రిక

## రాబోవు పుస్తకాలు

1. మనం—మన పరిసరాలు (సైన్సు వ్యాసాలు)
2. రథచక్రాలు (నవల)
3. రాజ్యమేలేదెవరు? (విమర్శనా గ్రంథం)
4. కీలుబొమ్మలు (కథల సంపుటి)